# నవలలు

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| సాశౌర్యరహస్యము | | 1 | 8 | అరక్షణీయా | | 1 |
| కుముద్వతి | | 1 | 8 | దయ్యాలు | | 0 |
| సింహగడము | | 1 | 8 | హనుమచ్ఛాస్త్రి కథలు | | 1 |
| మణిహారము | | 1 | 8 | ప్రేమసుందరి | | 1 |
| వ్రజరాణి | | 1 | 8 | ఫాస్టు | 1 వ భా॥ | 1 |
| కాశీఖండము | | 1 | 8 | డిటో | 2 వ భా॥ | 1 |
| సేవాశ్రమము | 1 వ భా॥ | 1 | 8 | మొగలాయిదర్బారు | 1వ భా॥ | 1 |
| సేవాశ్రమము | 2 వ భా॥ | 1 | 8 | డిటో | 2వ భా॥ | 1 |
| అంతఃపురము | 1 వ భా॥ | 1 | 8 | డిటో | 3 వ భా॥ | 1 |
| అంతఃపురము | 2 వ భా॥ | 1 | 8 | డిటో | 4 వ భా॥ | 1 |
| హత్యాభ్రమ | | 1 | 8 | గంగ | | 1 |
| మేరీరాణి | | 1 | 8 | కోహినూరు | | 1 |
| రాజ్యలక్ష్మి | | 1 | 8 | ఆటీన్ మనేలా | | 1 |
| విదురుని యుపదేశములు | | 0 | 12 | లలిత | | 1 |
| కాంచనమాల | | 1 | 0 | పెండ్లిదండ | | 1 |
| సీమంతిని | | 1 | 0 | ఉదంకుడు | | 0 |
| సుశీల | | 1 | 0 | లవంగి | | 1 |
| యమునాభాయి | | 1 | 0 | మాధవి | | 1 |
| శ్యామల | | 1 | 8 | భారతకథాసారము | | 1 |
| కాలసర్పి | | 1 | 0 | కథాకల్పవల్లి (చిన్నకథలు) | | 1 |
| గృహదహనం | 1 వ భా॥ | 2 | 0 | 9 గురు రచయితల నేటి ఉత్తమ నాటికలు | | 1 |
| డిటో | 2 వ భా॥ | 2 | 0 | శకుంతల | | 1 |
| చోరశిఖామణి | | 1 | 8 | రాజరాజు | | 1 |
| చిన్నకోడలు | | 1 | 8 | ఇప్పుడు | | 1 |
| అపరిచిత | | 1 | 8 | గుసగుస పెళ్ళి | | 1 |
| సంజీవి | 1 వ భా॥ | 1 | 8 | పెళ్లి ట్రెయినింగు | | 1 |
| డిటో | 2 వ భా॥ | 1 | 8 | రెండురెళ్ళు | | 1 |
| దాసీకన్య | | 1 | 8 | అన్నాడు | | 1 |
| స్త్రీసాహసం | 1 వ భా॥ | 1 | 8 | కాలక్షేపం | 1 వ భా॥ | 1 |
| డిటో | 2 వ భా॥ | 1 | 8 | | | |



# వలపులరాణి

గ్రంథకర్త:

తాంద్ర వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు




ప్రకాశకులు:

కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు,

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో,

రాజమండ్రి.




[వెల 1—0—0

# అంకితము

సీ. కోటిసూర్యులడాలు ♦ గోటమీటగ జాలు
భువనమోహనమైన ♦ మూర్తిగలిగి
సహజనిర్మలసిత ♦ చంద్రికావళిభాతి
దశదిశావిశ్రాంత ♦ యశముగలిగి
సంగీత సాహిత్య ♦ సంఘంబులందున
వాక్ప్రతిభను జాల ♦ వన్నె కెక్కి
కరుణాప్రపూర్ణుఁడై ♦ వరరామచంద్రుని
వలె శాంతి యుతుఁడని ♦ వాసిగాంచి

గీ. జ్యోతిషాదిశాస్త్రముల సు ♦ జ్ఞానుఁడైన
నాదుతండ్రికి గురునకు ♦ నారసింహ
నామయుతునకు నాదుగ్రం ♦ థంబు నిప్పు
డతులితానందమెసఁగ నం ♦ కితమొనర్తు.

ఇట్లు,
గ్రంథకర్త

# పీఠిక

ఆర్యులారా !

నే నీగ్రంథమును వ్రాయబూనుట కిదియే ప్రథమ తరుణము. ఇది యొక నిజమైన కల్పితకథ. నా ప్రియ మిత్రు లొకరీకథ నొసంగి వ్రాయ బూనుట కుత్సాహ మొసంగుటచే, బాల్యచాపల్యమున మితి లేనిదోషములచే పూరించితిని. గుణగ్రహణ పారీణు లగు పాఠకమహాశయులు మన్నించి తుదివఱకు పఠింప గోరు నాయాశయము నెఱవేర్ప గలందులకు ప్రార్థింపుచున్నాను. ఇందుగల దోసములు తెలియపఱచిన ముందు సవరించుకొందును.

ఇట్లు,

గ్రంథకర్త

## దైవ ప్రార్థన

ఉ. శ్రీనళినప్రకోమలత • జెన్నలరారెడు జానకీకరం
బూని విశేషవైభవము•లొందుచునుండగ మానివర్యులెం
తేనినుతింపఁ బెంపెసగు•నిద్ధచరిత్రుఁడు రామమూర్తి యిం
పూనియు నాదుగ్రంథమును • బ్రోచెడు గాతదయార్ద్ర
దృష్టితోన్.

ఇట్లు,
గ్రంథకర్త.

కీర్తిశేషులైన

## తాండ్ర నృసింహశాస్త్రి గారి స్మరణ

క. ప్రాజ్ఞులగని, కవితా
వాజిని గళ్ళెమునఁ బట్టి • పరగున నడుపన్
దేజముగల నిపుణుఁడు, వి
భ్రాజితు నరసింహ కత్ఁడె • పరము నొసంగున్.

ఇట్లు,
బి. టి. కృష్ణమాచార్యులు.

# వలపులరాణి

## ప్రథమ ఖండము

### శృంగారలావణ్యము—మనోదాయకము

౧

ఈరోజున మహారాజసౌధమున సంగీతసభ గావింపబడుచుండెను. అప్పుడే భాను డస్తాద్రి గ్రుంకుచుండెను. గోధూళికాసమయ మంతరించిపోయెను. సాంధ్య రాగపరంపరలు సక్రమముగ నదృశ్యమగుచుండెను. అప్పుడే పురము నెల్లెడల దీపకాంతులొక్కుమ్మడిని నీలాంకాశమున దారానిచయమును దిరస్కరించుచున్నవోయన బ్రకాశింప దొడంగెను. మహారాజబహిర్మందిరంబునందలి విశాలప్రాంగణము నం దనేక వేల దీపములు వెలుంగుచుండెను. దేదీప్యమాన కాంతులచే నలరారు నావిశాలప్రాంగణము నానావిధాలంకారములచే ముద మొందద నలంకరింపబడెను. మన కథాకాలమునాటి కిప్పటివలె విద్యుద్దీపములు లేవు. కాచదీపములు మాత్ర ముపయోగించెడువారు. అందందు నానావర్ణవిలసితంబులగు ప్రకాశనములు కన్నులపండువ సేయుచుండెను. ఆదీప

ములు మణులకాంతిని దిరస్కరించుచుండెను. క్రింద నానా వర్ణసూత్ర రత్నకంబళములు పరుపబడియుండెను. అందలి స్తంభములు పతాకములచేతను, సుందర కోమల పూగ పున్నాగ చంపక కరవీర రసాలపుష్పములచేతను నత్యంత రామణీయకముగ నలంకరింపబడెను. రాజబాంధవు లుచి తాసనంబుల బరివేష్టించిరి. సంస్థానోద్యోగులు నియమిత స్థలంబులం దాసీనులైరి. మహారాజు పురందరుడు భద్రచింతా మణీపీఠికాసీను డగునట్లు భూలోకసునాశీరునివలె రత్నఖచిత మైనదియు మణిమయాలంకృతమైనదియు నొక సింహాసన మధిష్ఠించెను. తమలపాకుల పళ్ళెరంబులు, పన్నీరుబుడ్లు, యత్తరుపెట్టెలు ప్రేక్షకులకు కరతరామలకంబు లగుచుండెను.

అప్పుడు దేదీప్యమానరత్న ఖచితభూషణభూషితయు, గాన కాలవిశారదయు, లావణ్యరాశియు నగు నొకగణిక యమృతంపుధారలు స్రవించునట్లు, మృదుమధుర స్వరంబుతో గానము జేయదొడంగెను. నృత్యము చేయుచుండెను. కూ ర్చుండి యభినయరూపమున మనోభావతరంగముల, రాగా లాపన జేయుచుండెను. ఒయ్యారముతో ముందు వెన్కలకు బోవుచుండెను. సభ్యులహృదయంబులు మోహాపూరితంబులై పోవుచుండెను. ఆ మందయాన క్రీగంటిచూడ్కులును, కోమ లహస్తాభినయములును నత్యంత మనోహరముగ రాజిల్లు చుండెను. హృద్వేగముతో నందఱు ప్రేక్షకు లామెవంకనే

తిలకించుచుండిరి. ఆహా! గాయకురాలి గానమెంత మృదు మధురస్వరమిళిత మైనది. ఆగాత్రము వీణాగానమును దిర స్కరించుచుండెను, కోయిలగానమును బరాభవించుచుం డెను. ఆమె పాడుచుండెను.

"సుజనమోహనా! రామా! రామా!! రామా!!!
రజతభూషణార్చితా ధర్మపాలనా! రామా!! సుజ॥"

అంతటా యిందువదన హిందూస్తానిలో బాడదొడం గెను. అది యిదియననేమి! ప్రేక్షకులను సమస్తగాన ప్రపంచమందును దేల్చివేసినది. ఆగాన మిదివఱకు నాస్వా దించి యెఱుగని ప్రేక్షకుడు సుధాధారలు వర్షించుచున్నదని శ్లాఘించకుం డుండునా? అప్పాటల గంధిభూషణము లాకాం తిమధ్యంబున మిఱుమిట్లు గొల్పుచుండెను.

ఆమెపేరు అలివేణి. ఆమె పునహాయందలి సుప్రసిద్ధ గాయకురాలు. వేశ్యాలలామ. ఐనను నామె వామభాగమం దాసీనమైయున్న నారీమణిసౌందర్యము వర్ణనాతీతమైయు న్నది. ఆమె సర్వాంగము లపరిమితరూపలావణ్యా సముత్తేజిత ములై యుండెను. అవిశాలలోచనములలో నమృతము గురి యుచుండెను. నవపల్లవసదృశంబగు కెమ్మోవియందలి విమల మందహాసలీలల నొకమారు తిలకించినంత మాత్రముననే మనోముద్రితము లైపోవుచుండెను. రాజామెనుం డదేకదృష్టి తోవీక్షించుచుండెను. ఇంకను నావిస్ఫుట మందహాసలీలలే-

నాక్రీగంటిచూడ్కులే—రా జిక మఱల్చుకొన జాల
ను. ప్రేమబీజము లిర్వురిమనస్సీమలబలముగనాటుకొని
ని. అది యందలిప్రేక్షకులలో నొక్కరైనను గను
ంకపోయెది. సుందర కాంతిమంతంబును, గానలహరీ
తంబును నగు నారాజబహిర్మందిరంబు నెవ్వరు విడిచి
ండిరి. ధూమపానాసక్తులు గానమును వీడజాలక
ానము జేయుటకైనను బయటకు బోజాలరైరి.
ాలు పాటను విరమించెను. రాజు లేచి నిలుపబ
ందఱును దమ రమ్యహర్మ్యములకుం బోయిరి. రాజు
ర్యనిర్వాహకునితో "వారిని రేపుదయంబున నేడు
ం రాజసౌధమునకు బశ్చిమంబుననున్న చలువరాతి
నకు రావలసినదని చెప్పు" మని యాజ్ఞాపించి దేవేరి
నకు జనెను.

ఆమెయెవ్వరు? ఆమె యేవలపులరాణి! కథానాయిక
తనయ.

౨

మరునా డుదయంబుననే యలివేణి తన కొమరితకు
ుందరదుకూలముల గట్టనిచ్చి, అత్తరుపన్నీరు మొదల
ధ ద్రవ్యంబు లలందుకొని, నిర్దేశిత మహాలునకు

యందూగుచుండెను. హుక్కా పీల్చుచుండెను. అలివేణి ప్రవేశించినతోడనే మహారాజునకు వందన మాచరించెను. రాజమందానందకందళిత హృదయారవిందుడయ్యె. ననుటకింకను సంశయమా! ఆభవనమంతయు నమూల్యవస్తు సమన్వితమై యుండెను. క్రింద కంబళములు పరుపబడియుండెను. గృహప్రాచీరములయం దారితేరిన చిత్రకారులచేత గీయబడిన నాలోకనములగు చిత్రములెన్నియో గలవు. భవనమధ్యభాగమున నొకగుండ్రమైన బల్లగలదు, దానిపైన ముఖమల్ సరిగంచు వేయబడిన చీనాంబర మొండుపరచియుండెను. దానిపై గ్రామఫోనుగలదు. ఒకప్రక్క నత్తరుపెట్టెయు రెండవవైపున దాంబూలపు పళ్ళెరంబును గలవు. ఆబల్లకనతిదూరమున రెండు సోఫాలును నాల్గుకుర్చీలును గలవు. పైన శ్రమనపనయించుగాలికి పంకాలుండెను. ఆతల్లికూతుండ్రా సోఫాలపై నాసీనులైరి. ఆహా! వలపులరాణి సౌందర్యము వర్ణింప శక్యంబె! సంపూర్ణపూర్ణిమాశశాంకబింబమును దిరస్కరించుచుండిన సుందరలలాట సౌందర్యమును వినీలకుటిలాలకంబులు ద్విగుణీకృతము జేయుచుండెను. కుసుమితలతావితానముల బోలిన వినీలకుంతలగుచ్ఛములు సుందరముగ సంస్కరించుట వలన నత్యంతమనోజ్ఞమై యుండెను. నీలోత్పలములవంటి కన్దోయి—అత్యంత కోమలమై భాసిల్లు కెమ్మోవియందలి విమలమందహాస లీలలు—మేరుశిఖరసన్నిభంబులగు సుకుమార కుచద్వయము—కల

హంసపదవిలాసముల దిరస్కరించు మందగమనము—ఆక్రీగంటిచూపులు—ఆతరళలోచనముల ధాళధళ్యంబులు—ఆప్రవిమల సౌందర్యాతిశయంబు—ఆ సంపూర్ణాంగ సౌకుమార్య లావణ్యములు—ఇదివరకు కని విని యెఱుగని దేవకామిని యనుటకు సందేహము లేదు. సుందర పుష్పములు, సంస్కరించుకొనిన కుంతలములందున జేరి సుగంధమును నల్లెడల విస్తరింపజేయుచుండెను.

రాజు—అలివేణీ! విశేషములేమి ?

అలివేణి—ఎవ్వియును లేవు ప్రభూ! తమదయ.

రాజు—నీవీ గ్రామమున కెచ్చటనుండి వచ్చితివి ?

అలి—మొన్న యింద్రపురంబున గానసభ జేసితి. అచ్చట నాకు సంవత్సరమునకు ఐదువందలరూప్యములు దయచేయించునట్లు బహుమతి వడసితి.

రాజు—నీపుట్టుకస్థల మెయ్యది—కాపుర మేడ ?

అలి—అయ్యా! నేను పునహాలో నొకవేశ్యను. నాతల్లి యిప్పటికి నాల్గుసంవత్సరముల క్రిందట లోకాంతరగతురాలైనది. ఆమె సుప్రసిద్ధగణిక. నేను సంగీతపాటకచే రీలపై జీవనము చేయుచున్న దానను.

రాజు—ఇచ్చట నీ కేమికావలయును ?

అలి—తమ కరుణాకటాక్షవీక్షణ ప్రసారమే.

రాజు—ఈమె యెవ్వరు ?

అలి—నాకొమరిత.

రాజు—నామ మెఱింగింపవైతివి.

అలి—ఈమె పేరా వలపులరాణి యందురు.

రాజు—రూపమునకు దగిననామమే పెట్టితివి.

అలి—వేశ్యలయిండ్ల నివ్విధంబుగనే యుండును.

రాజు—ఈమెకుకూడ సంగీతమందుప్రవేశమున్నదా?

అలి—నాకును యిద్దఱుపుత్రులు గలిగి చనిపోయిరి. ఆవ్యాకులతవలన చిన్నతనమునుండి యీమెకు విద్య నేర్ప లేదు. ఐనను చాలభాగము వచ్చునని యే నానమ్మకము.

రాజు—(వలపులరాణిని జూచుచు) అలివేణీ! ఏదీ పాడుమనుము. ఆగానము కూడ నాశ్రవణపుటంబుల పడ వేయుము.

వలపులరాణి యొక్కసారి మణుల గ్రుమ్మరించునట్లు వెన్నెలల వెదజల్లినట్లు—మల్లెమొగ్గలదండ తళుకుమన్నట్లు విమల మందహాస మొనర్చెను. ఒక్క క్రీగంటిచూడ్కుతో మహారాజునకు ప్రేమతరంగము లుప్పొంగినవి. మోహాంకుర మైనది. ప్రణయప్రతిమలు గాఢములైపోయెను. అంత వల పులరాణి యొకపాట పాడెను.

"రామా! జగదభిరామా - సుగుణలలామా!
తాటకాంతకా - రామా! రావణసంహార - రామా!
రణధీర! రామా! జయజయ రామా!! రామా!"

ఆహాహా!!! ఆగానము వేణుగాన మనవసరమని తోచునట్లు గావించినది. ఆగానములో రామనాను మైక్యమై పోయెను. రాజు కేవలానందనిమగ్నుడై పోయెను. ప్రేమ సాగరమున మోహడోలికలపై నుయ్యేలలూగుచుండెను. ఇంక నామెను జన్మాంతమునకైనను వదలునా!

రాజు—అలివేణీ! నే నొకసంగతి చెప్పుదును. సావధాన చిత్తవైయుండి వినుము. మున్ముందుగా నే నడిగిన ప్రశ్నకు సదుత్తరం బిచ్చి నావీనుల విందొనర్పుము.

అలి—భూపాలకా! దయచేసి యడుగుడు. నిజవృత్తాంతంబ నివేదించెద.

రాజు—నీకు బునహాలో నేదైన గృహము గలదా?

అలి—ఆ! ఇదివఱ కుండెడిదిగాని యిప్పటికి రమారమి యైదారుసంవత్సరముల క్రిందట దాని నమ్మివైచితిని.

రాజు—కోపగించుకొనకుము. నే నొకటి యడిగెదను ఇ-ది-వ-ఱ-కు-నీవు-గాని-నీకొమరిత-గాని- యెవ్వరి-యాశ్రయ-ములో నైన నున్నారా? అడిగితినని కోపముగాబోలు.

అలి—భూపురందరా! నా కిదివఱకు నా పూరిలో నున్న యొకానొక సంపన్నవర్తకునితో జెలిమియుండెడిది. కాని యిప్పు డాతడు మరణించినాడు. నాకొమరిత కింతవఱకు గన్నెరిక మెవ్వరును బెట్టలేదు. దయయుంచి—

రాజు—ఆప్రణయమే నేనును గోరుచున్నాను. ఆ

వాచామృతధారలు నీనోటినుండియే వచ్చినచో బాగుండు ననియే యింతవఱకు నాలోచించితిని—

అని యేమో చెప్పబోవుచుండ వలపులరాణి యక్కడ నున్న పీవన నందుకొనెను. ఆహా! చంద్రబింబము కదలినది బంగారులత విస్తరించినది–మేరుపర్వతము చలించినది–విద్యుల్లత మిఱుమిట్లుగొల్పినది – రాజు మఱింత మోహముగ్ధుడైపోవుచుండెను. ఆసుందర మధురమోహనవదనమండలముం దిలకించని ఘడియలు లేవు.

అలి—మహాప్రభూ! మాకు శాశ్వతరాజాశ్రయ మిప్పించ బ్రార్థించుచున్నదానను.

రాజు—దానికేమి– నాయంగీకారమున కాలస్యము లేదు–ఈ మహలునందే సదాయుండుడు. మీరువెళ్ళి పునహాలోని మీపరికరంబులన్నియు దెచ్చుకొనుడు.

అలి—శుభదినము జూచి దయచేయించినయటులనే తమ యాజ్ఞానుసారముగ బ్రవర్తింతుము.

రాజు—(ఆలోచించి) ఎల్లి పంచమీ బుధవారము ప్రవేశము చేయుట మంచిది. రేపుసాయంకాలముననే సిద్ధముగా సామగ్రియంతయు దెప్పించివైతును. కేళీగృహము మాత్రము—

వలపులరాణి రాజును దిలకించెను. ఇంకను నావిమల కోమలమందహాసరుచిరకాంతులే. ఇప్పుడు మఱింత ప్రగాఢ

ములైపోయెను. రాజు ప్రేమసంభ్రమంబున మోహావారాకరం బుపై హృదయంబును నడుపం జొచ్చెను.

అలి—అది తమయుత్సాహము ననుసరించియుండును

రాజు—కేళీగృహము మాత్రము నాల్గుదినంబులలో నే నత్యంతనయనాభిరామముగ సిద్ధము జేయించెద.

అలి—ఈయింటిలో దుర్మార్గులబాధ యేమియు నుండదుకద ?

రాజు—ఇచ్చట నటువంటి దుర్వ్యాపారము జరుగ నేరదని నిస్సంశయముగా జెప్పగలను.

అలి—అది తమకే తెలియును.

రాజు—వస్త్రము లెవ్వియైన గలవా ?

అలి—అమ్మాయికి యొక్క సుందరమైనవస్త్రంబును లేదు. బిడ్డ నెట్లుబాగుచేసినను మీరే. మాకుదైవసములు.

రాజు—గృహప్రవేశ మహోత్సవకాలమున జెంద గలవు. వానిని జాగ్రతగ భద్రపఱచుకొనుడు.

అలి—దేవరా! నే నొకవిన్నపము నివేదించెద సావ ధానులరై యాలింపుడు.

రాజు—చెప్పుము. దాని కింతగా నడుగ బనియేల?

అలి—ప్రతిదినంబును మాయందు వాత్సల్యతవహిం చి యొకతూరియైనను దర్శన మీయ ప్రార్థించుచున్నాను.

రాజు—అటులనే దప్పక వచ్చెద.

అలి—కడుంగడు సంతసము. అమ్మాయీ! ఇంత వఱకు మాట్లాడ వేమి? (రాజువంకదిరిగి) బాలికగావున సిగ్గు పడినది. మాయమ్మాయి చాల యుత్సాహవంతురాలు. ప్రేమాతిరేకములుగల మానవతి. (లేచి) ఇంక మేము సెలవుపుచ్చుకొందుము.

రాజు—అదేమి! ఈ దినంబునుండియే నాయింట నుండదగినది. ఏదినమున నీకొమరిత వలపులరాణిపై నాకు మోహ ముద్భవించినదో యాదినమునసుండియే మీరు నా దగ్గర నున్నారనుకొనుడు.

3

పాలతను రాజ్యమును మన కథాకాలమునాటికి శ్రీమ స్త్రిశ్యామసుందర భూపాలుడు ముదమొంద రాజ్యపాలన మొనర్చుచుండెను. ఆతడు తన పట్టాభిషేకసమయమున ప్రజాక్షేమమనియు వారికష్టసుఖంబులలో బాల్గొందుననియు గొప్ప మహోపన్యాసము గావించినాడు. రాజు సుందరపురు షుండు- బలిష్ఠుఁడు. పసిండిచాయ చేమేను బంగారు ప్రతి మయో యనునట్లు వెలుగొందుచుండును. దరిద్రులపాలిటి కల్పతరువు, కవులపాలిటి కామధేనువు, మోహమందు నాదే వేంద్రునంతటివాని బరాభవించునతంటి సరసుడు. అనాథ శరణాలయమున నాతని దయామిళితహృదయ మందఱకు విశ

దమయ్యెను. వైద్యాలయస్థాపనమున నాతని ప్రజావిచారణ మందలి యభిలాష యందఱకు నద్దమునందువోలె దేటతెల్ల మయ్యెను. నేరస్తులను విచారించి శిక్షవిధించుటలో నాతని సామర్థ్యము వర్ణనాశక్యము. కార్యనిర్వాహకుడన్న ప్రీతి యెక్కుడు. మంత్రివినయశీలుని యాలోచనల ననుసరించును ఆతడు మంత్రియైన దగ్గరనుంచి రాజ్యాంగ విషయంబుల జక్కగ జూచుచుండెను. రాజస్వచట్టములు క్రోడీకరింపబడి యెను. ప్రాథమికవిద్య నభివృద్ధిచేయుట కెన్నియో యేర్పాట్లు జరుపబడియెను. దేశవార్తలు సర్వజనులకు విశదమగునటుల వార్తాపత్రికలు రాజాధిపత్యమున వెలువడెను. నగరము వింతమిద్దెలతోడను, భవన ప్రాసాదములతోడను నలరారుట కెన్నియోయేర్పాట్లు జరుపబడియెను. సంఘ సంస్కరణ విషయములగూర్చి చర్చలు జరుపబడియెను. ధర్మము నాల్గు పాదముల నడుచుచుండెను. జారచోరభయ విహ్వలములడుగంటిపోయెను. ఇటులనే యింక ననేక యభ్యుదయసూచనలు గన్పడెను. ఈయాశలన్నియు మృగతృష్ణతుల్యము లని తెలిసికొనుట కెంతయోకాలము పట్టలేదు. ఈ యారంభశూరత్వ మైదుసంవత్సరంబులలోనే యంతరించినది. పరిపాలన చెడుత్రోవ ద్రొక్క మొదలిడినది. బహిరంగసభలందున దయారుచేసిన సంస్కరణ ప్రణాళికలన్నియు పత్రస్థములయ్యెనేగాని కార్యరూపము దాల్చలేదు. వార్తాపత్రికలు

పురిటిలోనె యంతరించినవి. ప్రాథమికవిద్య నభివృద్ధిచేయు టంతరించినది. రాజు నేరముల నిదివఱకు జూచినంత శ్రద్ధా ళుడై విచారించుట లేదు. వాణిజ్యమస్లే నిలచిపోయినది. రాజస్వచట్టముల క్రోడీకరించుటకు జేసిన ప్రయత్నము లన్ని యు సఫలీకృత మనోరథములు గాలేదు. రాజు ప్రాపంచిక సౌఖ్యముల గాలము గడుపుచుండెను. విషయేచ్ఛల మున్ని దరిగానకపోయెను. పూర్వులనాటినుండి యత్యంతశోభాయు క్తము గొప్ప పేర్వడసి, దశదిశా విశ్రాంతికీర్తిమంతమై శత్రు జనభీకరమైన యీపాలతను. రాజ్యరమ, శ్రీశ్యామసుందర భూపురందరుని విడిచిపోన దారిచూచుచుండెను. ఆతడు మహా దురభిమాని ఏకాలమున నేదితోచునో నదిగావించువాడే గాని మఱియెవ్వరు చెప్పినను వినునట్టి మానవుడుగాడు. చంచలహృదయుడు. ధైర్యసత్యగుణసమన్వితుడు. సుందరుడు ఐనను నహంభావమిళితదురభిమాన పరవశుడు. తా ననుభ వింపవలసినదానినెల్ల నెట్లయినను జెందును తనసౌధమును సుందరాలంకారములచేతను, తైలచిత్ర చిత్రితముల చేతను మనోహరముగ నలంకరించినందులకు నొక యాంగ్లేయ చిత్ర కారునికి రెండులక్షల రూప్యంబు లిచ్చెననుట యప్పు డతిశ యోక్తిగ గన్పడలేదు. ఇదియంతయు వలపులరాణిపై నున్న యపారమోహావాహినీకాతరంగీ ప్రభావమే!—కాక మఱి యేమి?

ఒకరోజున శ్యామసుందర భూపాలుడు తనయాశ్రితు రాలైన వలపులరాణి దర్శనాయత్తచిత్తుడై యామె మహాలునకుం జనెను. ఆదినము సంతోషపూరితమైనది. ఎందువలనన నాదినమున రాణిగారు శ్రీ సత్యదేవుని మనసార బూజించి బ్రాహ్మణ సంతర్పణ గావించెను. రాజానంద నిమగ్నుడయ్యెను. అతడు మహాలు పైభాగమునకుం జని యచ్చట కేళీగృహము తట్టెను. అంతయు నిశ్శబ్దము. మధ్యమధ్య కొన్ని యస్ఫుటవాక్యములు కొన్ని సంతోష వచనములు మొదలగు యాశ్చర్యములు జరగుచుండెను. రాజునకు కోపము ప్రజ్వరిల్లినది. దురభిమానము కత్తిపోటువలె నాటుకొని పోయెను. తలుపు తట్టెను.

"వస్తున్నాను ప్రభూ!" అను ప్రత్యుత్తరమే కోపాగ్ని రవుల్కొనెను. మఱియొకసారి కవాటము తట్టెను. కొంతవడికి తెరువబడెను. లోపల నెవ్వరును గాన్పింపరైరి. రాజాశ్చర్యసంశయ భయాదులతోడ స్తంభితుడై పోయెను. ఐన నిట్లు వితర్కించుకొనెను. "మనము జాగ్రతగ సరళ వచనములతో మనఃపరిశోధన కుపక్రమింతము" అక్కడ బల్లమీద వార్తాపత్రిక యొండు తెరువబడియుండెను. వలపుల రాణి యక్కడ నిలువంబడియుండెను. రాజొకపీఠికయందాసీను డయ్యెను.

రాజు—వలపులరాణీ! ఇంతదనుక దలుపు తెరువ వైతివి?

వల—ఏమిలేదండి! ఈవార్తాపత్రిక చదువుచున్న దానను.

రాజు—ఫలాహారము గావించితివా?

వల—ఆ! తమరాకకై యెదురుచూస్తిని. తమ దర్శనభాగ్యము శ్రీఘ్రకాలమున లభించలేదు.

రాజు—దానికేమిగాని నీ వెవ్వరితోడనో ప్రసంగించు చున్నట్లు వినంబడినది.

వల—అమ్మయ్యో! ఇంతలోవున్నది! వార్తాపత్రిక చదువుచున్నదానను. దానిలోని విషయంబుల జూచుచు నానందించుచుంటిని. గాని వేఱులేదు.

రాజు—(సంశయనివృత్తిచే) నీయందు నాకట్టి సంశ యముండునని యెప్పటికిని దలంచకుము.

వల—ఎల్లుండి బొంబాయినగరమున సంగీతసభ యట. నే నద్దాని సందర్శించవలెనని యున్నది. కాని దేవర వారి చిత్తము.

రాజు—నీవు బొంబాయినగర మెప్పుడైన జూచి తివా?

వల—లేదు.

రాజు—వెళ్ళవలెనని యున్నదా?

వల—తమ యనుగ్రహము.

ఇంతలో నలివేణి యచ్చటకు వచ్చెను. ఫలాహార ములు దాంబూలమును దెచ్చెను. అంత నక్కడ సోఫా లన్నియు మేడపై యంతస్థునకు బారావానిచే దేబడినవి. వాయుసంచారము బాగుగా నగుచుండెను. పశ్చిమదెస రంగుబంగారు సంజకెంజాయ లలముకొనుచుండెను. ఆహారము కొఱకు జనిన విహంగములు కలకల నినాదములతో దమకు లాయంబులకు జనుచున్నవి. కోయిల వీణాగానముబోలె పంచమస్వరంబున బాడుచుండెను. సుందరలతాంత పరిశోభి తంబులగు వల్లికామతల్లులతోడ బరిహాసమాడి పూగపున్నాగ జాజికరవీరరసాలపుష్పసౌరభ్యమును గొల్లలాడి, నిర్మల సరసీజలతరంగ డోలికామాలికలపై నుయ్యేలలూగి వీచు సాయంకాల మలయ సమీరము సర్వజనా హ్లాదకరముగ నుండెను. సంపూర్ణపూర్ణిమా మయూఖుడు నినీలనీలాకాశ మున శచీదేవి యంతఃపురమున చెలువంపు బంతియో యన ప్రకాశించుటకు సన్నద్ధు డయ్యెను.

అందఱు సోఫాలపై నాసీనులై యుండిరి. రాజు ఫలం బుల భుజించి తాంబూలచర్వణము గావించు చుండెను. సుగంధద్రవ్యము మేన నలందుకొనిరి.

రాజు—అలివేణి! మే మొకప్రయాణము నిశ్చయించు కున్నారము.

అలి—ఎక్కడకు ?

రాజు—బొంబాయినగరమునకు.

అలి—అక్కడేయున్నది.

వల—ఏమున్న దేమిటి. ఊరుచూచుటకు రత్నా బాయి సంగీతపాట కచ్చేరిని సందర్శించుటకు.

అలి—సంతసము.

రాజు—నీవుకూడ సిద్ధముగ నుండుము.

అలి—మనము మువ్వురమేనా?

రాజు—కార్యనిర్వాహకుడు విశ్వాసరావును గూడ దీసుక వెళ్ళుదము.

కొంతవడికి యలివేణి క్రిందికి దిగిపోయెను. రాజునకు కందర్పుడు పుష్పశరంబుల వేయజొచ్చెను. ఆతడావలపుల రాణిని యొక్క మూరాలింగనము జేసికొనెను. స్వర్గము—బ్రహ్మానందము—కేవలానందము—దేవేంద్రభోగము—రాజామె ముఖమండలమును దేరిపార జూచెను. ఇంక నావిమల మందహాస లీలలే!

౫

మరునాడుదయమున మహారాజు శ్యామసుందరుడును, వలపుల రాణీయలివేణులును, విశ్వాసరావును గలసి రాజుగారి బండినెక్కి పయనమయిరి. బండి యతివేగముగ నెళ్ళు చుండెను. సకాలమునకు బండి జిజూరుస్టేషనుచేరెను. ఇంతలో ధూమశకటము వచ్చెను. వారందఱు మొదటితరగతి

బండిలో కూర్చుండిరి. మధ్యాహ్నము పండ్రెండుగంటలకు ధూమశకటము పునహాపత్తనము చేరెను. అక్కడదిగి రాజుగారి మేనత్తకుమారుడైన రామరాజింటికి యొక యద్దెబండిపై వెళ్ళిరి. బండి గమ్యస్థానము జేరెను. విశ్వాసరావు బండివాని యద్దెయిచ్చి భవనము లోనకు వెళ్ళెను. ఆభవనమత్యంత రామణీయకమున నలరారుచుండెను. రామరాజక్కడకు వచ్చెను. (విశ్వాసునిజూచి)

రామ—ఎప్పుడు రాక.

విశ్వా—ఇప్పుడే. దొరవారు కూడ వచ్చినారు.

రామ—నిజమేనా?

విశ్వా—ఇంటిలో నబద్ధమాడవలసినంత పనియేమి.

అంత నాతడక్కడ మేడమెట్లెక్కి వెళ్ళిపోయెను. సరిగా మధ్యాహ్నము మూడుగంటలకు తిరిగి ధూమశకటస్థానమునకు వారందరు వచ్చిరి. ధూమశకట మధిరోహించి రాత్రియొంటిగంటకు బొంబాయి నగరముజేరి యొక యద్దెబండి మాట్లాడుకొని రహదారి బంగళావైపునకు బయలుదేరిరి. బండి శీఘ్రగతిం బోవుచుండెను.

అంతయు నిశ్శబ్దము. ఉచ్ఛ్వాసనిశ్వాసము బెద్దగవిడచినప్పుడు, సంపన్న వర్తకుల వింతభవనంబులనున్న గూళ్లయందున్న పారావతపక్షులు మధ్యమధ్య నిద్రమేల్కాంచి దమపక్షము లాడించిన చప్పుడు సమీపగృహంబులలో నిదురనుండి మేల్కాంచిన శిశువుల రోదనధ్వని. ఇవియే నిశ్శబ్దమునకు భంగముగలిగించుచుండెను. శరత్కాల సంపూర్ణ

పంచమినాటి శాకరుడు తనశీతలకిరణముల వెదచల్లుచునే యుం డెనుని. ర్మలశీతచంద్రికలలో నైగనిగ్యమును ధాళధళ్యంబును వెదచల్లు వెల్లగోడలతో రజతగిరిం దలంపించుచు మహోన్న తముగనున్న భవనప్రాసాదములప్రాకి వానికొక వింత చెలు వంబును గలిగించుచుండెను. వారువచ్చుకొలది హోర్వెట్టు సముద్రవీచికానినాదము దగ్గరాయెను. శకటము గమ్యస్థా నముచేరెను. బండివానికి కూలినిచ్చి వేసిలోనకు జనిరి. అక్కడ పారావాడు భుజంబున రివాల్వరు ధరించి నిశాసంచారము జేయుచుండెను. ఇదియంతయు గాంచుచున్న వలపులరాణి సంతోషస్వాంతయై యుండెను. ఆమె కదియంతయు మహో త్సాహసంజనకమై దర్శనీయమైయుండును. అందఱునుహంస తూలికాతల్పంబులవంటి పరపులపై బరుండి నిద్రాపరవశులైరి.

౬

మరునాడుదయంబుననే వారందఱు లేచి దంతధావ నాది కాలకృత్యంబులు, స్నానంబు గావించిరి. వలపులరాణీ యలివేణులు దమ కుంతలముల జక్కగ సంస్కరించుకొని సుగంధవస్తుజాలముల మేననలందుకొని సుందరశుభ్ర చీని చీనాంబరముల గట్టుకొనిరి. శీఘ్రగమనంబున నందఱు ఫలా హారశాలకుం జని పదార్థముల భుజించి యొక యద్దెబండిపై నగరమునందలి వింతలజూడ నేగిరి. సకలసౌభాగ్యలక్షణ

సమన్వితంబగు బొంబాయినగరము జూడని మానవుడుండుట ప్రపంచమునకు గళంకమనియే జెప్పగానగు. రహదారీబంగళానుండివారు ముందుగా వస్తుదర్శనశాలకుం జనిరి. సుందరంబులగు త్రేమ్రాకుగున్నలు, లాలిమించెడు గులాబీపొదలు, మనోరంజకములైన మల్లెతీగలు, సర్వజనాకర్షకములైన సంపెంగలు, రమణీయమైన పొదరిండ్లు, హృద్యానవద్యంబులైన చేమంతిచెట్లు, ఇవి యన్నియు వారలకు మనోముద్రితములై పోవుచుండెను. ఆచల్లని పిల్లవాయువుల సంఘర్షణము వలన నల్లనల్లన చలించుచుండినలతాంతపరిశోభితంబగువల్లికామతల్లులసుగంధపూరిత వాయువువారికెంతయు మనోనందదాయకముగ నుండెను. వారట్లొక దారినిబట్టి పోవుచుండిరి. నిర్మల శీతలోదకంబులచే నలరారు నొక సరస్సును గాంచిరి. వారు చాలదూరము నడచి వచ్చిరి. ఆవస్తుదర్శనశాలాభవన మింకెంతదూరమున్నదో వారెఱుంగరు. దానియావరణము చాల పెద్దది. దాని చుట్టుకొలత సుమారు పదునేనుమైళ్ళుండును. వారు పిపాసాబాధితులై యాసరసీజనపానమునకై మెట్లు దిగి దాహము ద్రావిరి. ఆసరస్సునకు చుట్టునుదట్టముగ నట్టి యల్లుకొనిన సురపొన్నవృక్షములు సరస్సునకు చుట్టుచు నొకవిధమైన వింతచీకటుల గ్రమ్మజేయుచుండెను. ఆ యస్ఫుటాంధకారమున మధ్య మధ్య నక్షత్రములవలె మణిపంక్తులవలె రాలుచున్న పుష్పములు క్రిందనీటిలో బడి యందున్న నీలోత్పలముల కొక వింతచెలు.

వంబును గలిగించుచుండెను. సరస్సునకు మధ్యభాగమున బాలభానుని కిరణజాలముల నుద్భవించిన తేజమువలన జలంబునకు జలంబులో బసిండిరంగు గలపినారో యను సందేహము వొడముచుండెను. అంత వారక్కడనున్న వింతల జూచుచు మందగమనంబున బోవుచుండిరి. అటుల పోవుచు సమీపముననున్న పొదరింటిలోని రామచిలుకల పంజరముల జూచి వాని మృదుమధురవాక్యసరళి విని యానందనిమగ్నులైరి. పదపడి సింహ శరభ శార్దూల గండభేరుండ హస్తి మర్కటేత్యాది నానావిధమృగముల దిలకించి యాశ్చర్య భయవిహ్వాలులైరి. భవనము ప్రవేశించి నానావిధమణి సముదాయంబును వీక్షించి సంతసంబంది యచ్చటనున్న బౌద్ధదేవుని చిత్రప్రతిమ తిలకించి తుష్టులైరి. అనంతరము మన శృంగారచతుష్టయము టాజ్ మహాలుహోటలురోడ్డున బోవుచుండిరి. తదుపరి వస్త్రములు కొన్నికొని పాదరక్షలను కొని విశ్వవిద్యాలయపు ప్రాంతమునకు జనిరి. భానుడు తన ప్రచండకిరణముల భూమినంతయు దహించివైచుచుండెను. తిరిగి సాయంత్రము జూడగానగునని యెంచిగాబోలు వారు తిరిగి రహదారి బంగళాకు వెళ్ళిరి. వెంటనే వారు భోజనము చేసి కొంచెముసేపు నిదురించిరి. పురపాలకసంఘమువారిచే నియమింపబడిన సేవకు డప్పుడే మూడుగంటలు కొట్టెను. ముందుగా విశ్వాసరావు లేచి యలివేణీవలపులరాణులను నిదురనుండి లేపెను. సిద్ధముగానుండిన పానీయములనుద్రావి

సుందరముగ నలంకరించుకొని సముద్రతీరంబునకు విహారము నకు జనిరి. అచ్చట జాలతడవు గూర్చుండిరి. వాయుచలన మున నల్లలాడుచు శోభాయుక్తముగనున్న సాంద్రవీచికా తరంగమాలికలపై నుండి వచ్చు సమీరము మనోరంజక ముగ నుండెను. పొగయోడ లెన్నియో తిరుగుచుండెను. సంద్రంబంతయు నౌకలచే నిండి నిబిడీకృతమై పోయెను. ప్రొద్దు గ్రుంకుసమయమున వారుతిరిగి బంగళావైపునకు వచ్చిరి. దినమంతయు దన నిశితకిరణజాలముల వెదచల్లిన సూర్యభగవానుడు తన సతీదర్శనాయత్తచిత్తుండై పశ్చిమ సముద్రమున గ్రుంకులిడబోయెను. అప్పుడే నిశాకాంత తన ప్రభావమనర్గళముగా జూప మొదలిడినది. శీఘ్రముగ భోజ నముచేసి గానసభకు వెళ్ళిరి.

౭

రాత్రి వినయభూషణుని యింట సంగీతసభ జరుగు చుండెను. అందఱకు సంతోషదాయకముగ నుండెను. కాచ దీపములందున్న రసగోళికలు ప్రక్కలన వ్రేలాడుచుండ రామణీయకముగ నుండెను. గాన వాఙ్మాధుర్యము చయ్యన గ్రోలు సరసులసంఖ్య మెండయ్యె. అంతయు నానందప్రఫు ల్లమై యుండెను. గానశిరోమణియగు నానర్తకి సౌకుమార్య సౌందర్యలావణ్యరాశి యనుటకు సందేహము లేదు. మధ్య మధ్య కరతాళధ్వనులు— జయజయధ్వానములు— సభ

నెవ్వరును విడిచి పోజాలకుండిరి. గానలహరీసమంచితంబగు నాప్రాంగణము నెవ్వరు విడిచి పోజాలకుండిరి. హేమపాత్రలు పన్నీటితో మిళితమైన గంధమును దాంబూలపు బళ్ళెరంబులును సభ్యులకు సదా కరతలామలకంబు లగుచుండెను. వాయుప్రసారమునకు చాకలివాండ్రు పంకాల లాగుండిరి. ప్రాంగణము మాత్రము మనోరంజకముగ నుండెను. పాట మాత్రము ప్రాంగణమును సరితూగుట లేదు.

రాజు—రావూ! ఇంక వెళ్ళుదమా-

విశ్వా—అప్పుడేమి! తొందరగా వెళ్ళుద మనుచున్నారే?

రాజు—నీ క్షుండవలెనని యున్నదిగాబోలు—

విశ్వా—తమయాజ్ఞ యనుల్లంఘనీయము.

సంగీతవిశారద పాటను విరమించెను. వలపులరాణి యామెతో జాలసేపు ముచ్చటించెను. ఆమె మాట్లాడు చున్నంతకాల మామెవంక నే తిలకించుచు నక్కడొక ధనికుడైన వర్తకుడు లావణ్యరాశియగు వలపులరాణిని జూచి మోహముగ్ధుడై పోయెను. ఆమె నిక్కముగ వలపులరాణియే కాక మఱియెవ్వరు! ఇంతమంది జనులను దన సౌకుమార్యము చేత మోహసాగరమున దేల్చివైచు నామె సుందరమధుర మోహనవదనమండలముఁ గాంచి విడచిపోవు మానవు డెండైనగలడా! ఆమె యాతనిపై నొకటిరెండుమార్లు క్రీగంటి చూడ్కుల బరపెను. మోహలతవిస్తరించినది. కామలత

పెరిగిపోయినది. కొంతవడికాతడు వెడలిపోయెను. అప్పుడే నాలుగుగంటలు గడియారము కొట్టినది. అర్దెబం క్షేమియు లేవు. వా రంధకారమునబడి నడువజొచ్చిరి. షష్ఠిచంద్రుడ స్తంగతుడయ్యెను. ఆనిబిడాంధకారమధ్యమున వారు వచ్చుచుండ, ఆనిశ్చలవాయుసంచారమున, ఆసముద్రవీచికాసముద్భూత యఖండసనాదమందున, ఆప్రశాంత సమయమున దూరము తరుగదాయెను. కొండవడికి యొక శకటావళి వారికి లోచన గోచరంబయ్యెను.

విశ్వా—(ఒక బండిగానినిజూచి) ఏమోయి! ఎక్కడకు యీబండ్లు;

బండివాడు—బాబూ యివి రైలుస్టేషనుకు.

విశ్వా—ఇప్పుడేమి రైలున్నది.

బండి—బరోడాకు వెళ్ళురైలునకు.

విశ్వా—ఇన్నిబండ్లు ఒక్కసారిగా పోవుచున్నవేమి?

బండి—ద్వారకకు బోవుచున్నారట-ఎల్లుండి శ్రీకృష్ణజయంతిగాదా?

విశ్వా—ఓహో! అదియా కారణము!

అంత వారు వాయువేగమున దమ రహదారీబంగాళాకు వచ్చిరి. ఎవ్వరును శేషరాత్రి నిదురించలేదు. ఎందుకననప్పటికే నాల్గు గంటలన్నర యైనది.

రాజు—విశ్వాసరావూ! మనముగూడ ద్వారకకు వెళ్ళుదమని యున్నది. నీయభిప్రాయ మేమి?

విశ్వా—పోవుట బాగుండుననియే తోచుచున్నది.

రాజు—అలివేణీ! నీయాలోచనమేమి?

అలి—సరే! నాదేమున్నది. వెళ్ళిన బాగుండును. తమ దయ—దేవుని సందర్శించి రాగలము.

రాజు—నీ వెప్పుడైన జూచియుంటివా?

అలి—సరే లెండి! బొంబాయినే యెఱుగనిదానను ద్వారక నెఱుంగుదుననియా—

రాజు—మా రాణి యాలోచన యేమియో?

వలపులరాణి—సుందరుని యంగీకారమే నేనను సూచించుచున్న దానను.

రాజు—ఈసాయంతనముననే పోదమా.

విశ్వా—మఱియెప్పుడు పోవలయును. ఎల్లుండియే కదా శ్రీకృష్ణజయంతి.

రాజు—సరియే యీదినముననే బయన మగుదము.

అంత సూర్యోదయ మయ్యెను. బాలభానుడు తన కిరణజాలముల బ్రపంచమున బ్రసరింపజేయదొడంగెను.

౮

నేడు శ్రీకృష్ణజయంతి. ఈదినంబుననే పీతాంబరధరుడును, నీలమేఘచ్ఛాయ సన్నిభుడును, శంఖచక్రగదాశంఖాద్యాయుధధరుడును, ననంతుడును, జనార్దనుడును, లోకపాలకుడునునగు శ్రీకృష్ణుని జన్మదినమహోత్సవము. ఆదినారాయణు

డగు శ్రీమహావిష్ణువు కంసాది దుష్టశిక్షణార్థమై పాండవేయాది శిష్టరక్షణార్థమై భూలోకమున దేవకీగర్భమున జనించిన మహాపర్వదిన మీదినముననే. ఈదివసంబుననే వసుదేవుడు తనయష్టమపుత్రుడగు శ్రీకృష్ణుని గంసుడు దునుమాడునను భయంబుల నత్యంత శీఘ్రగమనంబున నిస్తరంగకమలాకరం బగు యమునానదినిదాటి వ్రేపల్లెకుంజని యశోదశయ్య యందు గృష్ణుని యునిచి యందున్న నాడుబిడ్డందోడ్కొని ఖలుండగు కంసునిబారి తప్పించుకొనిన మహాదిన మీదినమే. ఈరోజుననే హిందువులు భక్తిశ్రద్ధాళులై దయాంతఃకరణు డగు వాసుదేవు నారాధింతురు. ప్రతి పల్లెలోను బట్టణము లోను మహోన్నతముగ జరుపబడు యీజయంత్యుత్సవము శ్రీకృష్ణుని ముఖ్యపట్టణమగు ద్వారకయందు వర్ణనాతీతముగ జరుగుననిగొ నొక్కి వక్కాణింపగాసగు. ద్వారకయందలి పూర్వస్మృతిచిహ్నము లింకను విలుప్తములై పోయియుండ లేదు. అందలి రథ్యలు గడుంగడు విశాలములు. ప్రాంగణ ములు రథ్యలంత విశాలములుగావు. ద్వారకయందలి సుందర విశాలరమణీయోద్యానములును, చలువరాతి తిన్నెలును, ఆపుష్కరణీ తీరస్థ సుస్నిగ్ధ శిలానిర్మిత సోపానపంక్తులును యాత్రికుల హృదయములను సంపూర్ణభక్తిభావములనునాటి పరమపావనులుగా జేయుచుండెను. పిల్లనగ్రోవి చేతంబుచ్చు కొని వేణుగానము జేయుస్థలము—గోపికాయోషామణులతోడ మేలమాడుచు జలక్రీడలాడు సరస్సు—యాత్రికు లివివీక్షింపు చున్నపుడు, వారిహృదయములు భక్తిభావపూరితమై పోవు

నప్పుడు, శరీరము దన్మయమొందునప్పుడు, వారికిగల్గు నానందము యెట్టి చిరస్మరణీయ శాశ్వతానందమునుగల్గియుండునో వ్రాయ శక్తిచాలదనియే చెప్పవచ్చును. రథ్యలన్నియు బైరాగులచేతను, నిత్యము శ్రీహరినామసంకీర్తనము జేయు యోగులచేతను, గృహస్థులచేతను, పిన్నపెద్దలచేతను నిండి నిబిడీకృతమై పోయెను. దేవాలయము ప్రాకారపరివేష్టితమైనదిగాదు. ఐనను దివ్యమంగళ విగ్రహుండగు నా కృష్ణ భగవానుని విగ్రహము ప్రేక్షకజనానంద దాయకముగ నుండెను. దేవాలయములో దేవునకు నీరాంజన మర్పించుటకుగాబోలు భేరీ వాయించిరి. అంత జనులందఱు గర్భాలయ సోపానమువద్దకు జనుచుండిరి దేవాలయములో విశాలము గనే యుండును. మన శృంగారచతుష్టయ మనుకొనినరీతి గర్భాలయంబును జేరిరి. స్త్రీలకు ప్రత్యేకమార్గ ముండుట వలన నలివేణీవలపులరాణు లాదారిని రావలసి వచ్చెను. వలపులరాణి లోచనప్రచాలనము హఠాత్తుగ నక్కడొక వ్యక్తిపై బడెను. ఆవ్యక్తి తన వెంటనే వచ్చుచుండెను. వలపులరాణికి సంశయభయాశ్చర్యము లొక్కుమ్మడి గల్గెను. అయిన నామె విమల మందహాసలీలల రుచిరకాంతు లింకను తేజోవంతములై పోయెను. చదువరీ! నీ వెఱుంగుదువా యీ వ్యక్తిని? ఆతడు వినయభూషణుని యింట వలపులరాణిని గాంచి మోహమొందిన వర్తకుడు!

వ్యక్తి—ఎవరండీ మీరు?

వల—ఎవరైన నేమి కావలయును!

వ్యక్తి—మిమ్మెక్కడనో చూచిన జ్ఞాపకము. అందు వలన నడిగితిని.

వల—నన్నెక్కడ చూచిరి?

వ్యక్తి—ఆఁ స్ఫురించినది — వినయ భూషణుని యింట—నా వ్యక్తితో మాట్లాడుచుండగా నేనక్కడనుంటి.

వల—ఆతఁడు మీ కేమి కావలయును?

వ్యక్తి—నా కేమియుగాడు, ఆత డొక వర్తకుడు. ఆతనికి నాకును నేమియు సంబంధము లేదు. ఇద్దఱము స్నేహితులము.

వల—మీరెక్కడనైన గుమాస్తాగా యున్నారా?

వ్యక్తి—నాకంత నీచవృత్తి యేమి! నాకు నాస్వంత వ్యాపారము గలదు.

వల—మీపేరేమి?

వ్యక్తి—నాపేరుతో నిప్పుడు పనియేమి?

వల—(నవ్వుచు) చెప్పిన నష్టమేమున్నది.

వ్యక్తి—నాపేరు రత్నలాలు అందురు.

వల—మీరొక్కరేనా వ్యాపారము చేయుట?

వ్యక్తి—నాతమ్ముడు మోహన్‌లాలు దూరదేశములకు జని యచ్చటినుండి బట్ట లెగుమతి జేయును. ఇచ్చట నేను వ్యాపారము జరుపుదును.

వల—ఏవర్తకము మీది?

వ్యక్తి—బట్టలవర్తకము.

వల—ఇప్పుడు మీ కేమికావలయును.

ఇంతలో నలివేణి యామెను బిలచెను. వలపులరాణి బయలుదేరెను. ఇంతదనుక నలివేణి యెవ్వరితోడనో మాట్లాడుచుండినందున నామె యిదియంతయు నెఱుంగదు.

రత్నలాలు—నన్ను మరువకుము. మీ విలాస మేమి?

రత్నలాలామె వెళ్ళగనే గర్భాలయపు గోడమీద నేదియో వ్రాయుచుండెను. అది వలపులరాణి గమనించక పోలేదు. తిరుగవచ్చునపుడు చూచెదగదాయని యామె లోనకు జనుదెంచెను. దేవుని గీర్తించుచు మానవులు గోవిందాయని కరతాళధ్వనులు చేయదొడంగిరి. కొంతవడికి ప్రసాదము స్వీకరించి బయల్వెడలిరి. వలపులరాణి తిరుగ వచ్చునపుడు గర్భాలయపు గోడమీదనున్న యక్షరపంక్తుల జదివికొనెను.

"రత్నలాలు, బొంబాయి" అని చదువుకొనెను. వారింటికిబోయి తిరిగి పాలతనునగరసన్నద్ధులైరి.

౯

రాజు—రాణీ! దాని కేమిదుర్బుద్ధి?

వల—ఏమో! వింతగొల్పుచున్నయది.

రాజు—(కోపారుణనేత్రుడై) నీవెఱుగవా యేమి?

వల—దైవసాక్షిగ నేనెఱుగను.

రాజు—ఈప్రమాణముల కేమి.

వల—చెప్పకుండనే లేచిపోయెను.

రాజు—(కోపముతో) నాపేరుప్రతిష్ఠలకుగూడ కళంకమయ్యెనే. ఇటువంటి దుశ్చారిత్ర—కృతఘ్నురాలిని—ప్రభువంచకురాలిని—మూర్ఖురాలిని—పయోముఖ విషకుంభమును—గోముఖవ్యాఘ్రమును—ఇదివఱకు నేనెక్కడను జూచియుండలేదు. ఎవరో గోపాలరావుని బెండ్లియాడునట—

వలపులరాణికి దల్లిని తిట్టినటువంటి తిట్లు శూలముల వలె బాధించకపోలేదు. తల్లిని—నవమాసములుమోసి కని పెంచి పెద్దదానిగ జేసిన మాతను—కొకడట్టు తిట్టుచుండగని యనాథయై యూరకుండు మానవు లెందైనగలరా! లేరు. వారరుదు. రాజు కోపాగ్నిచే దహింపబడుచుండెను. ఆకోపమున కంతమే లేదు. అనేకమైన యశ్లీలవాక్యములు తిట్టెను. వలపులరాణి లలాటమునుగుంచించెను.

వల—రాజా! ఏలయీాలీల దూలనాడెదరు. అపరాధముచేసినది. క్షమాపణమే లేదా. ఇటువంటి తప్పులు మీాబోటి మహారాజులకు లేకుండెనా జానులెండి మీారు మహారాజులు మీారేమిచేసినను నదియుత్తమోత్తమ మనియే పరిగణింతురు తప్పుచేయుట సర్వజనులకు సామాన్యముగ నుండును. దానికిన్నితిట్లు తిట్టవలెనా?

రాజు—ఛీ! దుర్మార్గురాలా!! నీవుగూడ చెడుత్రోవ త్రొక్క మొదలిడుచున్నావా? నాకు దెలియకుండ లేచిపోయినది. నాకు దెలసినచో జంపియే నైతును. నీకుగూడ నదియే మార్గము గన్పడుచున్నదా? నాచేతులలోనుండి నీవుపోదలచుకొన్నను నీకు వలనుపడదు. ఇటువంటి దుశ్చారిత్రలని గలనైనదలంచకపోతినే అజ్ఞానాంధకారమున బడితినే?

వలపురాణికి రాజుమాటలు శూలములవలె నుండెను. విన శక్యముగాకుండెను. ఆతండింత పరుషముగ నెన్నడు గతినోక్తుల బల్కలేదు. మాట్లాడునని గలనైన దలంచలేదు. ఆమె వినినదగ్గరనుండి యాతనియందొక యసహ్యము జనించినది. ఆమె యీవిధంబుగ దలపోసెను.

"నాతల్లి నన్ను యీరాజువద్ద దిగవిడచి వెడలిపోయెను. నేనిప్పుడు పంజరబంధమై రామచిలుకభాతి నైపోతినే. కటకటా! ఎట్టిదుస్థితికి బాల్గొనవలయునోగదా! ఎట్టితెరినైనను నేనీతని విడిచిపోవలయును. ఎక్కడకుపోదును. ఎవరు నన్ను దన యండజేర్చుకొందురు. ఈతడశ్లీలవచనముల జాలపల్కెనే! నాతల్లి యాతనికి దెలియకుండగనే లేచిపోయినందుకు నేనుగూడ నామార్గమే యను సరింతునను కొనిగదా యీతడు తలంచెను. అందుచేతనేగదా నన్నిట్లు తిట్టెను. లేకయున్న శ్యామసుందరుడిదివఱకిట్లు పల్కెనా— కానిమ్ము; మాటాడిక నాకేమికొదువ. ఈతడు గాకున్నమరి

యొకడు నన్ను జేపట్టువారీభువియందే యుండరా. ఈతనినిప్పుడే బెదరించ గూడదు. ఈత డింకేమి మాట్లాడునో ముందేట్లు జరుగునోచూతము'' అని తలంచెను. కొంతకాలమునకు శ్యామ సుందరుడింటికి వెడలిపోయెను. రెండుమూడు దినములు గడ చినవి. ఆ రెండుదినములు రాజురాలేదు. పూర్వపు వలపుల రాణిగాదు పూర్వపు సౌందర్యముగాదు పూర్వపు మాటలు కావు—పూర్వపు విమల మందహాసలీలలు గావు—ఇప్పు డవన్నియు నూతనోద్ఘటనా ప్రవూరిత వాక్యజాలములు గాని మరెవ్వియుగావు.

౧౦

సర్వజనులకు నాహ్లాదకర మైనది వేట. అది పూర్వపు రాజుల నెక్కు డాశ్రయించియున్నది. ఆ నిర్జనారణ్య మధ్య ప్రదేశంబున, ఆ సింహశరభశార్దూలగండభేరుండాది మృగం బులరవంబుల యందున ఆ వెదురుపొదలందున, ఆ కొలను లదరులయందు, వేటాడుచున్న సమయంబున రాజులకు గల్గు నానందము తమ నిజదారలయందును గూడ నుండదనియే జెప్పగానగు. పూర్వపురాజులు వేటయనిన వెంటనే జను దెంతురు. ఒక్కొక్కతరి యది పాపభూయిష్ఠ మగును. పూర్వము తాపసవరేణ్యులకు వన్యమృగములబాధ దప్పించు నిమిత్తమే వేటాడుచుండెడువారు. కాని యిప్పుడు వినోదము నకే నిర్ణయింపబడినది.

ఈరోజున శ్యామసుందరుడు పూర్వపురాజుల యుద్దేశ ముతోడనే నైరానదీపరిసరారణ్యప్రదేశంబున వేటాడుటకు సప్రయత్నముగ సేనాసమూహముతోడ నరుదెంచెను. అర ణ్యమంతయు వీరుల యరవులచే గగ్గోలు పెట్టబడుచుండెను. కొంతకాలము దుప్పుల వేటాడిరి. అది వారికి దగిన వేటగా గాన్పింపకపోయెను. ఈలెలు మృగంబుల కీవైపునుండి యావలివైపునకు దూసుకొనిపోవుచుండెను. భీకరమైన మృగం బొక్కటియు వారికి గాన్పింపదాయెను. ఇంతలో నొకదరి నుండి రెండు కొదమసింగంబులు బొబ్బరించుచు, భూమ్యా కాశములు దద్దరిల్లునట్లు శ్యామసుందరు డున్నచోటి కరు దెంచెను. అంత నొక్కసింగం బాతనిపైకి లంఘింప రాజు తన నిశితకరవాలమున కద్దాని బలిగా నొసంగెను. ఆరెండవ సింహ మాతనిపైకి లంఘింపబోవుచున్న సమయంబున శ్యామ సుందరభూపాలుడు మృగరాజుపైకి దుమికెను. ఆ కేసరి యంతట పలాయనము గావించెను. అట్లు పోవుచు దారిలో నున్న మిట్టపల్లముల, ముండ్లపొదలను దాటుచుండెను. రాజు కూడ నెట్టికష్టములైనను లెక్కగొనక కొన్నిమైళ్ళవరకు దానిని వెంబడించెను. స్వేదము కాల్వలు గట్టుచున్నది. పిపాసాబాధ యశక్యముగా నుండెను. ఆయాస మత్యధికమై యుండెను. అనివార్యమైన నా పంచానన మెంతసేపని పర్విడ గలదు. కొంతవడి కది వెనుకకుదిరిగి రాజుపైకి దుమికెను.

రాజు ధైర్యకంచుకమును దొడిగికొని యాతని కత్తితో నొక్క వ్రేటున నా హార్యక్షమును జంపివేసెను. ఆతనికిగూడ బలమైన దెబ్బలు తగులకపోలేదు. రక్తము కాల్వలుగట్టసాగెను. కొంతవడి కాతడాయాసముచే నక్కడ నిదురింప జొచ్చెను. ఆతని యెడమకన్నదరెను. ఆత డిట్లని తలంచెను. "ఏమిది; నా వామలోచన మదరుచున్నదే! కష్టా! యెట్టియిక్కట్టులు యింకమీద సంభవించునోకదా! దైవమా! వేటయనునది నీ ప్రపంచమున నేల నెలకొల్పితివి. అందులో రాజుల కెందు కద్దాని ప్రీతికరముగ జేసితివి. చేసితివి పో—దానికొరకు నేనెందు కరుదెంచితిని! నాతోడి సైనికు లెవ్వరు గానరారైరి. నేనెందు బోదును. నా కష్టమెవ్వరి కెఱింగింతును ఆహా! శిరోవేదనగూడ యధికమగుచున్నదే—ఇట్టి యిక్కట్టున నా వలపులరాణియే యున్న నేదియు సంభవించదుగదా— నాకష్టమప్పు డపనయించును గదా—నే నప్పు డానంద డోలికలపై నుయ్యేలలూగుదునుగదా—వలపులరాణీ! నేను నిన్నెన్నడును వదలను—నీవు నా మానసాపహారిణివి— నా జీవితరత్నమువు! (బాధ నపనయించుకొని) ఆహా! ఇది యేమివెఱ్ఱి! రాజునైకూడ నిట్లు విలపించుచున్నానే" అని యాతడు పలవరించుచు నిదురించెను. కాలచక్రము తిరిగినది. ఆతడట్లు సాయంసమయమువరకు నిదురించెను. కొంతవడి కాతడు మేల్కాంచెను. అంతయు నాశ్చర్యము—సంభ్ర

మము—తత్తరపాటు. రాజొక్కపెట్టున స్తంభితుడై పోయెను. ఆత డెక్కడికో యొక మేనాలో దీసికొని పోబడుచుండెను. ఆతని కాలుసేతులు బంధింపబడినవి. ఆతడు రోషారుణ నేత్రుడై "ఎవరురా నన్ను దీసికొనిపోవుచున్నారు. ఎక్కడకో చెప్పకున్న మిమ్మిపుడే కాలుని సదనంబున కనిపెద"నని లోన లేచి కూర్చుండెను. ఇంత నక్కడ నున్నాడుగాబోలు క కోయవాడు—

"ఏంలేదయ్యా! పనుండి తీస్కెళ్తున్నాం! అట్లా బెదరకు."

రాజు—దుర్శీలా! నోరుమూయుము. నన్ను విడువుము. లేకున్న నీతల మెగిరిపోవును.

కోయ—అరవబోకు. ముందున్నది ముసళ్ళపండుగ.

రాజు—(తనలో) ఈతడు నన్నేమిచేయును. ఏదియో దుష్కార్యమును జేయుటకే గాబోలు నన్ను దీసికొని వెళ్లుచున్నాడు. ఏమిచేసినను కట్లువిప్పవలె వీని పనిబట్టెదను. ఈతని జంపక తీరుదునా—

అంత మేనా యొకచోట నాగిపోయెను. ఆతడు లోననుండి దిగెను. ఆతని దుస్తులు మృగయావినోదమున కుచితంబుగ నుండుటజేసి యాతని నెవ్వరు గుర్తింపజాలకుండిరి. ఆతని యాకృతి మారినది. ముఖము వివర్ణమైనది. కాళ్ళు తడబడుచుండెను. ఒడలు వణకుచుండెను. నోటమాట లేదు భయకంపితుడై పోయెను. ఆతడు పాలతను రాజ్య

రమణుడని యెన్వరెఱుంగుదురు. ఆతడు దిగినది యొక కోయ గూడెము. ఆ పల్లెయంతయును మంగళతూర్య నిస్వనంబులు భూనభోంతరాళములు నిండించి వైచుచుండెను. రాజు భయ విహ్వాలుడై పోవుచుండెను. అదియొక పండుగ దినముగ దోచెను.

ఆతని నాదివసంబున బలియిచ్చుటకు గాబోలు నాతనికి యభ్యంగనస్నానము చేయించిరి. ఇదియంతయు నాతని బంధించియే చేయుచున్నారని పాఠకు లెఱుంగుదురుగాక! కంఠంబున వేపాకుతో జేసినదండ నొకదానిని యాతనికి వేసిరి. అంత నాతనిని యూరివెలుపల పోలేరమ్మ దేవాల యంబునకు దోడ్కొనిచనిరి. రాజునకు భయాగ్రహము లొక్కుమ్మడి యూతని గలంచివైచుచుండెను. ఇట్టియిక్కట్టున నాతని నెవ్వరు రక్షింతురు. దారిలో నాతనికత్తి యున్న దేమోయని చూచెను. ఖడ్గములేదు. ఆతని యాసలడుగంటి నవి. ఆతని కెవ్విధమైన సహాయములేదు. నిస్సహాయులకు దైవమే శరణ్యము! ఆతనిని యూపమునకు గట్టివైచిరి. అకస్మాత్తుగ నొక మనుజుడు చేత కరవాలముం బూని యొక యశ్వంబును నవరోహించెను. ఆతనిని శ్యామసుందరుడు గుర్తింపలేకపోయెను. వెంటనే యూతని బంధములు విడ దీసెను. ఇది గాంచుచున్న యూకోయవాండ్రకు నా నూతన వ్యక్తికి ఘోరమైన పోరాటము సంభవించెను. వీరుడగు నా నూతనపురుషు డెట్టకేలకు శ్యామసుందరునితోడ వెడలి పోయెను.

శ్యామసుందరుడు తన కష్టములో మున్గియున్న దినం బునకు మఱుసటిదినంబున రత్నలాలు దనమేడపై శయ్యాగారమున బరుండియుండెను. తన మనస్సంతయు వలపుల రాణిపై విలీనమై పోయెను. అతనికి నిదుర లేదు. ఆహారము సయితమాతని కయిష్టముగ నుండెను. నిజదారను గలనైన దిలకించడు. అతడు నిదురించగనే వలపులరాణి కలలో తన సౌందర్యమును వెలిపుచ్చుచు జగన్మోహినివలె గానుపించును. అతనికి వలపులరాణి సౌందర్యకళలను మనోపటమున గీయుచు, ఆతని భావజాలంబు లన్నియు నామెపైననే యాధారపడి యున్నవి. వర్తకవ్యాపారవిషయంబుల నంత శ్రద్ధాళుడై యుండుటలేదు. ఇంతలో తపాలావా డాతనికొక యుత్తర మిచ్చి వెడలిపోయెను. అత డత్యాతురముతో దానిని విప్పి చూచెను. అది జిజూరునగరమునుండి వచ్చియుండెను. అం దిట్లున్నది.

“హృదయేశ్వరా!

నేను తమను ద్వారకానగరగర్భాలయ సామీప్య మ్ముందు జూచిన దగ్గరనుండియు నాకు దమపై నొకవిధమైన మనోద్రేకము గల్గుచున్నది. ఈ ప్రణయమునకు దమరు దయాసాంద్రులై, తమ కరుణాకటాక్షవీక్షణముల నాపై బ్రసరింపజేసి యంగీకరించిరేని నేను సంసిద్ధురాలను నాపరిస్థి

తులు దమకు చెప్ప టంత బాగుండవు. ఏమైననుండిన నేను తమకు జెప్పెదను. నే నప్పుడు బజారునుండి తమవద్దకు సాయంకాల మైదుగంటలబండిలో రాగలను. శారదాకుటీర మువద్ద దమకు గన్పడుదును. దర్శనమియ్య బ్రార్థితులు- నేను తప్పక రాగలను.

ఇట్లు,
తమయాశ్రితురాలు
వలపులరాణి''

అనియుండెను. ఆతని సంతోషమునకు మేరయే లేదు. ఆనందసాగరమునకు దరులు గానరాకున్నవి. ఆతని కెప్పు డైదుగంటలగునా యనుధ్యానమే. వెంటనే యాతడద్దాని మరల జదివెను. ఇటులనే యాయుత్తరమును పదిసార్లు చదివి సంతోషముతో దిగ్గునలేచి సుందరంబులైన వస్త్రంబుల ధరించెను. ఆయింటిచుట్టును పిల్లమామిడిచెట్లు—నారికేళ వృక్షపంక్తులు—గులాబిపొదలు - మల్లెతీవెలు - చామంతి దుబ్బులు - ఇంకెక్కెక్కులుగలవు. ఆచెట్లనడుమ—ఆపచ్చని గడ్డియందు—ఆపుష్ప సుగంధప్రపూరితవాయుమధ్యంబున - నాభవనము రజితగిరిందలంపించు పిల్లగోడలతో మహోన్నత ముగ నుండెను. సాయంకాలమున దీపంబులు విద్యుత్ప్రకాశ మును వెదచల్లుచుండుట జగజ్జేగీయమానముగ నుండెను. భవనాంతర్భాగమున నొకచలువరాతిగదియున్నది. దానిని

రత్నలాలు పరిశుభ్రముగా జేయించెను క్రమముగా సంధ్యా రాగమజాండమంతయు గ్రమ్ముకొనెను. వెంటనే తనచలన హేతుకశకటము (motor car) మీద శారదాకుటీరము వద్దకు జని లోన కుర్చీపై గూర్చుండెను. ఇంతలో నొకబండి వీధివద్దనాగెను. అంతనొక్క స్త్రీమూర్తి లోనకరుదెంచెను. ఆమెయే వలపులరాణి. ఆమె సౌందర్యము శరత్కాల ప్రభావప్రగాఢోజ్వల మైపోయెను.

రత్న—రాణీ! యెచ్చటనుండి రాక?

రాణి—బజారునుండి వచ్చితిని.

రత్న—ఇంటివద్దనుండియేనా?

రాణి—కాదు-మాయమ్మవివాహమును జూచివచ్చుచుంటిని.

రత్న—ఎవరిని వివాహము జేసుకొనినది?

రాణి—గోపాలరావనునతని బెండిలియాడినది.

రత్న—వివాహంబునకు బూర్వము — కోపగించుకొనకుము- నీవెవ్వరియొద్ద నుంటివి?

రాణి—వివాహమునకు బూర్వము నేను చదువుకొనుచుండెడిదానను.

రత్న—ద్వారకానగరమునకు నిన్ను దీసుకవచ్చినదెవ్వరు?

రాణి.—నూ అమ్మ పినతండ్రికొడుకు-

రత్న—ఆత డేమిచేయును ?

రాణి—ఆతడు కళ్యాణనగరమున షాహుకారు గుమాస్తాగా నుంటున్నాడు.

రత్న—ఆతడు నిన్నెవ్వరికైన నిచ్చి పెండ్లిచేయ లేదా?

రాణి—ఆతనికి నేను చదువుకొనుచున్నానని కోపము-

రత్న—మీాజన్మస్థల మెయ్యది ?

రాణి—మాది పునహా అయిన మేము మాయమ్మ పినతండ్రి కుమారునివద్ద యుంటిమి ఇంతలో మాఅమ్మ మరి యొకని పెండిలి యాడినది.

రత్న—నీవిక్క డెన్నినాళ్ళుండవలెనని యూహ?

రాణి—నాకు విద్య కొంతవరకు వచ్చినది. తరువాత మాకులాచారక్రమముగ విషయేచ్ఛల మున్నదమని తలంచి నామోహసాగరమునకు దగిన నావికు డెవ్వడాయని శంకించు చుండ నవమన్మథునివలె దమరు నాకు ద్వారకానగరమున గన్పడిరి. మిమ్ము వీడుట నామతంబుగాదు. తమదయ యెన్నాళ్ళుబలంబుగ నుండునో యంత కాలము నేను మీాదాన నే— ఇది సత్యము—

రత్నలాలును వలపులరాణిని దోడ్కొని యింటికి జనెను.

౧౨

శ్యామసుందరుడుక్రమక్రమముగా తేజోవంతుడయ్యెను నానాటికి యాతనికి స్వాస్థ్యము గల్గుచుండెను. ఆతని నాదినంబున కష్టపరంపరావిముక్తుని జేసినవ్యక్తిని దెలిసికొనవలెనని యుత్సాహము మనఃపథమున నాటిపోయెను. ఒకరోజున శ్యామసుందరుని విశాలప్రాంగణమున సభ గావింపబడుచుండెను. సభ్యులు గుంపులుగుంపులుగ నరుదెంచిరి. ప్రాంగణము నానావిధాలంకారములచే ముదమొంద నలంకరింపబడియెను. వాయుసంచారమునకు పంకాలనులాగుచుండిరి. మంత్రిబృంద ముచితాసనంబుల బరివేష్టించిరి. రాజు లేచి ప్రారంభోపన్యాసము గావించి దన్నానాడు వేటయందు రక్షించిన మానవోత్తము డెవ్వడో వచ్చి తగిననిదర్శనము జూపి తనచే నొసంగబడు బహుమతి వడయవలసినదని చెప్పెను. అంత నక్కడ నున్నవారిలో నొకరినొకరు జూచుకొనసాగిరి. అంత నొక వ్యక్తి సుందరచీని చీనాంబరధరుడై, కరవాలము కరమందున మెఱయ రాజసింహాసనము వద్దకువచ్చి యొక యుంగరము జూపెను. ఆతఁడెవ్వడు. ఆతడు మా పాఠకులకు బరిచితుడే. ఆతడు విశ్వాసరావు. వెంటనే రాజమందానంద కందళిత హృదయారవిందుడయ్యెను. అంత రాజు తాను వేటకు బోయిన సంగతియు, దాను పడినకష్టపరంపరలను గ్రమక్రమముగా జెప్పెను. ఆవిశ్వాసరావుకు మణిమయ రత్నఖచితమైన

నొక మాలను బహూకరించెను. ఆతని కిచ్చుచున్న మాస వేతనము నాలుగువందల రూప్యంబులను నెన్మిది వందలకుగా వృద్ధిచేసెను. సభచాలించి యందరు వెడలిరి. శ్యామసుంద రుడు వలపులరాణి మహలునకు బోయెను. అచిరకాలము లోనే యాతడు సౌధోపరిభాగముజేరెను. ఇంట నెవ్వారు గాన్పింపరైరి. వలపులరాణీయని బిగ్గరగబిలచెను. ప్రత్యుత్త రము లేదు. కేళీగృహముద్ట్టైను. అది బయటకు దాళము వేయబడియుండెను. దానిపైన సీమసున్నముతో గొన్ని వాక్యము లాతలుపుపై యుండెను. అందిట్లుండెను.

"రాజా! నీవు నన్ను చేపట్టినదాదిగ నాకెన్నియో మేళ్లుకలుగ జేసితివి. దానికి కడుంగడు సంతసము. కాని నీవు రెండుదినంబులనుండి నాయందుజూపిన యనాదరము గాంచిన దగ్గరనుండి నాకుకూడ నీయందట్టిభావమే నుద్భూతమైనది. ఈరెండుదినంబులనుండి నీవు నావద్దకు రాలేదు. ప్రస్తుతము నేను వెళ్ళిపోవుచున్న దెందుకన యీ యసహ్యాభావమిట్లే వృద్ధియై మున్ముందు నీకును నాకును గలహము దప్పకసం ప్రాప్తమగును. కలుషలుపుట్టును. ఇట్టి యసందర్భములుగాం చియే నేను త్వరగా బలాయితురాల నగుచున్నాను. నాకొ రకు శ్రమపడుదువనియే నెఱుంగుదును. కాని యదియంత వృథాప్రయాసము, లేనిపోని కష్టాలకు లాభ మేంౘైనగలదా! ఒకవేళ నీవునన్ను దిరుగ గ్రహించిన నప్పటి సందర్భ

మోట్లుండునో యూహింపజాల. ఇక నాకు గాలహరణమగు చున్నది. నే పోయెద.

ఇట్లు
వలపులరాణి''

రాజు నిశ్చలుడై పోయెను. అది కలయో కల్లయో గూడ నాత డూహింపజాలకపోయెను. అతడు సాలభంజిక వలె నట్లే నిలువంబడెను. ఆత డిట్లని తలంచెను ''నే నేమి యామెనంటిని! ఆమెతల్లిని యన్నప్పు డేమియు రోషముం బొందలేదె! పొందకున్న నేమి? పొందకున్న నిట్టిపనిచేయునా? లేక యామె యెవ్వరియందైన మనసునిల్పినదా? ఆపె నెవ్వరైన బలాత్కారముగ గొంపోయియుందురా? ఈభవనంబున కెవ్వరు రాజాలరే! ఒకవేళ ''నన్ను దిరిగి పరిగ్రహించిన నప్పటి సందర్భ మెట్లుండునో యూహింపజాల'' నన్నదే— ఇంకను నాపైని యామెకు సంపూర్ణానురాగము వదలినది కాదు. ఎటులైనను నామెను జేపట్టవలయును'' అని పరిపరి విధంబుల నాలోచించెను. ఇంతలో విశ్వాసరావ ప్రయత్నముగ నచ్చటకరుదెంచెను

రాజు—రావు! నూతనసంఘటన మొండు జరిగినది.

విశ్వా—ఏమంత తొందరపని.

రాజు—వలపులరాణి లేచిపోయినది.

విశ్వా—నిజముగానా!

రాజు—నేనువచ్చుసరి కిక్కడ తలుపులు తాళము వైవబడి యున్నవి. ఇక్కడికువచ్చిచూడ నీ వచనంబులు నా కంటబడినవి. ఆలోచించుచు నిక్కడనే కూర్చుండియుంటి

అంత విశ్వాసరావు గూడ నావచనంబుల జదువు కొనెను.

విశ్వా—ఆమె నెవ్వరో తస్కరులు గొనిపోయిరని యా మీ యభిప్రాయము?

రాజు—ఔను.

విశ్వా—అట్లెన్నటికిని జరుగలేదు. ఈ రచనవలన యామె తన యిష్టానుసారమే లేచిపోయినదిగాని మఱేదియు గాదు.

రాజు—కార్యక్రమమేమి?

విశ్వా—ఎక్కడకుబోయియుండునని మీ యూహ?

రాజు—వేయి యాలోచనలెందుకు? కార్యభారమంతయు నీపై వదలివేసితిని. అదంతయు నీవేకనుపెట్టవలయును. కార్యసాఫల్యమగునటుల యాలోచింపుము. డబ్బునకు కొదువలేదుకదా?

విశ్వా—పూనాకేమైన బోయినదేమో!

రాజు—అక్కడకుబోయినట్లు గుర్తేట్లు?

విశ్వా—మీ రామరాజేమైన—

రాజు—ఆత డంతటి నీచవృత్తిగలవాడు కాడు.

విశ్వా—ఇది కలికాలము, అందులో మోహము, తండ్రికొడుకులకే మనఃస్పర్థలుండును. ఎవరినైన బంపిన నంతయు దెలియును.

రాజు—ఎవ్వరిని బంపవలదు. ఎవ్వరు పోయినను ప్రయోజన మేమియులేదు. నీవే పోవలయును. రేపుదయమునకే రెండువందల రూప్యములు దీసుకొని, మువ్వురిసేవకులతో గలసిపొమ్ము. రివాల్వరును కత్తియును దీసికొనిపొమ్ము నీవు వెళ్ళినగాని కార్యసాఫల్యము గానేరదు. ఎటులైనను నామెజాడ తెల్పవలయును.

౧3

విశ్వాసరావు మరుసటిదినంబుననే రాజాజ్ఞప్రకారము పూనాలో దిగెను. రామరా జింటలేడు. ఆత డహమదునగరమునకు జనెను. విశ్వాసరా వక్కడనున్న పారావాని బిలచి

విశ్వా—నాగాయ! ఇక్కడ కెవ్వరైన స్త్రీమూర్తి రెండుమూడు దినంబులలో వచ్చెనా?

నాగాయ—ఎవ్వరును వచ్చినట్లు లేదే.

విశ్వా—నిజము చెప్పిన ఫలము బొందగలవు.

నాగాయ—ఆసంగతి నాకు దెలియదా.

ఊరంతయు గలయదిరిగి రాత్రి బండికి కల్యాణనగరమునకు జనెను. అక్కడ ప్రయాణీకుల విశ్రాంతిగృహంబున

బయుండి మరునా డూరంతయు వెదకిరి. నిదర్శనమేదియు దొరకక పోయెను. ఆమధ్యాహ్నముననే యాతడు బొంబాయి వెళ్ళెను. ఆతడు రహదారి బంగాళాలో విడిదితీసికొని సాయం కాలము చీనాబజారునకు బోయిరి. ఊరు చూచుటయేగాని యేమియు గన్పడదు. వెంటనే వారు పార్కు వద్దకు జనిరి. అక్కడ నేమియు జాడ తెలిసినది కాదు. అంత బ్రొద్దుగ్రుం కుటచే వారు రహదారిబంగాళాకువచ్చి భోజనముచేసి వినయ భూషణుని మందిరంబునకు జనిరి. వినయభూషణుడు వారల గౌరవంబున నాదరించెను.

విశ్వా—అయ్యా! కృష్ణజయంతికి మూడుదినంబులకు బూర్వము మీయింట సంగీతసభ జేయించినారు జ్ఞాపకమున్నదా?

వినయ—ఆ! లేకేమి? ఒక మైసూరు వేశ్య పాడినది.

విశ్వా—ఆమె యెచ్చట నుండును?

వినయ—ఆమె నివాసము బాగుబజారునందు కలదు.

విశ్వా— తెలిసినది.

వినయ—ఆమె యెందుకు?

విశ్వా—చెప్పగూడని రహస్యమున్నది.

వినయ—నాకు జెప్పిన నేదైన సహాయము జేతును.

విశ్వా—(రహస్యముగా) వలపులరాణి యనియెడు నొక వేశ్య మారాజుదగ్గర చాలదినంబులనుండి యున్నది. ఆమె యిప్పుడు లేచి వచ్చినది. దానికొరకు వెదుకుచు నిక్కడకు వచ్చితిమి.

వినయ—ఇప్పుడు రత్నాబాయితో పనియేమి?

విశ్వా—వలపులరాణికి యామెకు స్నేహము. కాన యామె కేదైన దెలియునేమో యని.

అంత వారు చలనహేతుకశకట మధిరోహించి బాగు బజారునకు వెళ్ళిరి. శీఘ్రముంబుగనే వారు రత్నాబాయిగృహ ముం జేరి తలుపుదట్టిరి. రత్నాబాయి వెంటనే తలుపుదీసి వారలకు దగు మర్యాద లొనర్చెను.

వినయ—రత్నాబాయీ! కుశలమా?

రత్నా—అంత క్షేమమేనండి.

వినయ—మాయింట సభ జేసిన దినంబున నీతోడ సభయంతంబున మాటాడిన యువతి యెవ్వరు?

రత్నా—ఆమె వలపులరాణి! ఆమె పాలతనురాజు వద్ద నుండెడిదట. ఇప్పుడేమి పనియుండినది?

విశ్వా—ఆమె లేచిపోయినది. ఆమె జాడ యేమైన నీకు తెలసిన జెప్పుదువని తలంచి నీవద్దకు వచ్చితిమి.

రత్నా—అట్లనా! దైవసాక్షిగ నాకేమియు దెలియదు! ఇప్పుడు మీరు చెప్పుచుండ వింటినే కాని నాకు దెలియదు. అసలు నాకు దెలియుట కేమియు నవకాశము లేదు.

కొంతవడికి వారు వెడలిపోయిరి. ఆరాత్రివారందరు వినయభూపతుని మందిరంబుననే విశ్రమించిరి. మరునాడుద

యంబున నదేవిధంబుగ జెప్పనలవికాని స్థలంబుల కెన్నియో మార్లు వెళ్ళి పరీక్షించిరిగాని యాశాలత తెగిపోయినది. పవలంతయు నిటునటు దిరుగాడిరి. సంధ్యాసమయంబున వారు సముద్రతీరంబునకు జనిరి. సాయంకాల సమీరమును గ్రోలుచు వార్తాపత్రికల జదువువారు లెక్కకు మిక్కుటముగ నుండిరి. విశ్వాసరావు కూర్చుండక యచ్చటనున్నవారందర జూచుచు బయలుదేరెను. అకస్మాత్తుగ నాతనిదృష్టి యక్కడ గూర్చుండిన స్త్రీపురుషులమీద బడెను. ఆతని యానందము నకు మేరయే లేదు. ఆతనిజూడగానె యాస్త్రీవ్యక్తి దిగ్గున లేచి పురుషుని పోవుదమని హెచ్చరించినది. వెంటనే యామిథునము తమ మోటారు నెక్కిరి. విశ్వాసుడు సమయస్ఫూర్తిగ వెంటనే యామోటారునకు వెనుకనుండు చక్రమును బట్టుకొని కూర్చుండెను. మోటారతివేగముగ బోవుచుండెను. ఒకటిరెండు తడవ లాతడధఃపతితుడగుటకు సంసిద్ధుడయ్యెనుగాని యెట్లో మరల కూర్చుండెను. రాత్రి యేడు గంటలకు మోటారు మీరుబజారులో నొక గృహమువద్ద నాగిపోయెను. విశ్వాసరావు వెంటనే దిగి యామోటారు నంబరును జదివికొనెను. దానిమీదనున్న యాయెఱ్ఱదీపమున నానంబరు విశదముగ నగుపడియెను. ఆతడానంబరు 2782 బి అని చదువుకొనెను. వెంటనే యాబండిలోనుండి యా స్త్రీ పురుషులు దిగి లోనకువెళ్ళిరి. ఆస్త్రీమూర్తి యెవ్వరు?

ఆమెయే వలపులరాణి! ఆతడక్కడనున్న మఱ్ఱిచెట్టుచాటున దాగుకొనియెను. ఆస్త్రీపురుషులట్లు లోనకు జనినవెంటనే మోటారు తన స్థలమును జేరెను. కొంతవడికి విశ్వాసరావు గూడ నాభవనమునకు జని యచ్చట వీధిగుమ్మమువద్ద నొకసీమసున్నపుముక్కతో × అను గురుతువేసి రహదారి బంగాళాకు బోయెను. అచ్చట వినయభూషణుడును తక్కిన మువ్వురు నాతనిరాకకై నిరీక్షించుచుండిరి.

విశ్వా—వినయా! వచ్చితివా?

వినయ—నీవెక్కడకో మమ్ముల విడిచివెళ్ళితివి.

విశ్వా—కార్యసాఫల్యమైనది.

అంత నాతడు చేసిన ప్రతికార్యమును వరుసగా జెప్పెను. అందరు సుఖనిద్రాపరవశులైరి.

బాలభానుని కిరణజాలములు త్రిభువనంబులపైబడిన నెంతటి మూర్ఖుడైనను నిదురనుండి మేల్కాంచకుండునా! ప్రకృతివచ్చి మనుజుల మేల్కొల్పినట్లు ప్రతివారును లేచి తమకాలకృత్యంబుల నెరవేర్చుదురు. ఇది మానవప్రపంచమున సహజమైన విషయము. విశ్వాసుడు వినయభూషణాదులతో పురపాలకసంఘమునకు జనెను. లైసెన్సుగుమాస్తా వద్దకు జని యానంబరతనికి జెప్పి యాయంకెగల మోటారు యజమాని యెవ్వరని యడిగిరి. ఆగుమాస్తా కష్టపడి తుదకెట్లో యాబండియజమాని రత్నలాలనియు మీరుబజారున

యుండుననియు తెల్పెను. అత్తనికి పదిరూప్యంబు లిచ్చి వారు మీారు బజారునకు నొకయద్దెబండిపై వెళ్ళిరి. విశ్వాసరావు దిగి యాతడు గుర్తించిన గృహ మెయ్యదియోయని పరీక్షిం చెను. ఆతడు నిలువెల్ల స్తంభితుడై పోయెను. అన్ని యిండ్ల మీాదను వరుసగా నాగురుతులే! ఈసారి వారందరక్కడ నున్న యొక పెద్దమనుష్యుని యడిగిరి. లోనకుబోయి రత్న లాలున్నాడేమో కనుగొనిరి. లేడని తెలిసికొని వారందరు వినయునిమందిరంబునకు వెళ్ళి సాయంకాలమునకు విశ్వాస రావు తనసేవకనికాయముతోపాలతనునగరమునకు వెడలెను.

# వలపులరాణి

## ద్వితీయ ఖండము

### హత్యావిధానము—పరిశోధన—సాఫల్యము

ఈదినమున 'కృష్ణానందభవనము' నందు 'ఫిరంగి గుండు' అను కథయొక్క పరిశిష్టఖండము విద్యుద్దీప ప్రదర్శనము జరుగుచుండెను. ఆకథ జనులందరకు హృద్యానవద్యంబుగ నుంటజేసి చాలమందివెళ్ళిరి. శృంగారమిథునము తమ మోటారుపై వెడలి లోనకుర్చీలపై గూర్చుండి కథను జూచి యానందించుచుండిరి, అందు జరగుచున్న భయంకర సంఘటనము—శత్రుజనభీతకృత్రిమజాలములును—సాహస నైపుణ్యకృత్యములును—మనఃక్లేశ హత్యారహస్యములున్న గాంచినదాదిగ రత్నలాలునకు భయము వొడముచుండెను. వలపులరాణి ప్రోత్సాహముచేత నాతడా ప్రదర్శనాంతమువరకు వెడలలేదు. సరిగా రాత్రి రెండుగంటలకు ఆట యాపబడెను, రత్నలాలుమనస్సింకను స్వాస్థ్యమును బొందలేదు. అంతయు నంధకారము. తమము నల్గడల విస్తరించెను. మింట జుక్కలు మినుకుమినుకుమని ప్రకాశించుచున్నవి. విద్యుద్దీప ప్రదర్శనా

గత జనులయరపులు—శకటముల రొదరొదలు—వీటిచేభూన
భోంతరాళములు ఘూర్ణించుచున్నవి.

అట్లు మోటారు పరంజ్యోతిపలాలువీధినుండి పోవుచుండెను. భవనంబులుసైత మాయంధకారమున గన్పడుట లేదు. ఇంతలోనజాండమంతయు మేఘావృతమయ్యెను. దట్టముగనట్టెయల్లుకొనిన మేఘావళులనుండి భూమి ఘూర్ణిల్ల జేయుచు నురుములు ప్రారంభించెను. విద్యుత్కాంతులనందగు మెఱపులు గనులమిరుమిట్లు గొల్పుచుండెను. అంతయు భీభత్సముగానుండెను. అట్టి సందిగ్ధసమయంబున—వర్షము మదమత్తేభకుంభసదృశముగ కురియుచుండినసమయంబున—చలనహేతుకశకట మానందకుటీరము దాటిపోవుచున్నసమయమున—అట్టితరి మరియొక మోటారు రత్నలాలుమోటారున కెదురాయెను. ఆనూతన చలనహేతుక శకటమునడుపువాడు మద్యపానపరవశుడై యుండెనేమోయని రత్నలాలు మోటారుడ్రైవరు తనబండినాపెను. ఆక్రొత్తమోటారునుండి యిద్దరు వ్యక్తులు తమబండి దిగి రెండుతుపాకుల ప్రేల్చిరి. రత్నలాలు కూర్చుండినవాడట్లే మోటారులో బడిపోయెను. ఆతనికి తుపాకిగుండు హృదయంబున దగిలెను. మరల కొలది ఘటికలలోనె యింకొక గుండుతగిలెను డ్రైవరునకు పాదము విరిగిపోయెను. ఆదుష్కర్ములట్లు వలపులరాణిని తీసికొనిపోవలయునని ప్రయత్నింపయింతలో ప్రదర్శనముజూచి వచ్చు

జనులనెక్కించుకొనివచ్చునద్దె మోటారుబండి వచ్చుటజేసి హంతకులు తుపాకులగాల్చుచు బయలుదేరి వెడలిపోయిరి. వారునల్వురును నీలాంబరములచే దమముఖములు గప్పికొనుట చేత వారి నెవ్వరు గుర్తింపజాలకపోయిరి. వెంటనే రత్న లాలు మోటారుడ్రైవరు తనమోటారు నతివేగముగ నడుపు టారంభించెను. రత్నలాలు భవన మింకను రెండుమైళ్ళున్నది రత్నలాలునకు నోటమాటలేదు, రక్తము స్రవించుచుండెను. డ్రైవరు విషణ్ణవదనుడై పోయెను. చేతులు గజగజవడంక జొచ్చెను. వలపులరాణిభయవిహ్వలయై పోయెను. ఆమెయూ తని ప్రక్కన గూర్చుండెను. ఆతని యూరడించ మొదలిడెను హఠాత్తుగ మరలదుపాకులప్రేల్పులు ముందు వినబడెను. వలపులరాణి తన విద్యుద్దీపమును వెలిగించి ముందుకు జూచెను. మోటారు వచ్చుచుండెను. ఈసారి డ్రైవరు భయభ్రాంతుడై పోయెను. కన్నులనీరు నించెను. ఆవచ్చు మోటారట్లు వచ్చి వీరిమోటారును మరలగొట్టెను. ఈసారి వలపులరాణిని దస్కరించవలెననిగాబోలు వారలలో నొకడు తనబండి దిగి వీరలబండిని సమీపించెను. ఆతనికొకచేతిలో రివాల్వరును, రెండవచేతిలో కత్తియునుండెను. వలపులరాణి నిర్భయముగా దనమేలిముసుంగునుండి యొక రివాల్వరుదీసి ప్రేల్చి "దురాత్ములారా! మాటిమాటికి మమ్మిట్లు బెదరింతురా" అనుచు నానూతనవ్యక్తిపై లంఘించెను. అబలలకు

లోంగు వేలయగు నాకాలకాకోదరము శాంతించి వెడలి పోయెను. ఈసారి హంతకులు ముప్వురేయుండిరి! ఈసారి చూపిన సాహసము వలపులరాణికి వన్నెదెచ్చెను. ఆమె ధైర్యకంచుకము దొడిగికొన్నట్లు నిశ్చలమానసంబుతో ధైర్యమతిశయింప బండివానిని హెచ్చరించుచు బయల్వెడలెను. హంతకులు దమదారిబట్టి పోయిరి. అచిరకాలంబు లోనె వారు రత్నలాలుమందిరముజేరిరి. అచ్చటనున్న సేవకుని బిలచి యాబండిలోనున్న రత్నలాలును బండినడపువానిని లోనకుదీసికొనిరమ్మనమని యాజ్ఞాపించెను. రత్నలాలు నొక బరపుపై బరుండబెట్టిరి. ఆతనికి శైత్యోపచారంబులెన్నియో చేయు టారంభించెను. అది సఫలమగునా!

౨

రత్నలాలు మెత్తనిపరపుపై బరుండియుండెను. మోహనలాలును, వలపులరాణియు, తదితర బంధువర్గమును నాతనిచుట్టును గూర్చుండి దుఃఖించుచుండిరి. డాక్టరు వరప్రసాదుడు రత్నలాలునకు లెక్కలేనిమందుల వాడుచుండెను. ఆతనికి తెలివియేలేదని డాక్టరు చెప్పగానె యందఱు పెద్ద పెట్టున రోదించిరి. మధ్యమధ్య డాక్టరు వారలనూరడించుచుండెను. వరప్రసాదుడిచ్చిన మందులబలముచేత రత్నలాలు గాయములనుండి స్రవించురక్త మాగిపోయినది. అప్పు డాతడు కన్నులవిప్పి చూచునని యాశపడిరి.

వర—మోహన్‌లాల్! తుపాకిగుండ్లు రెండు హృదయకోశములోనున్నవి. దెబ్బలు బలముగా దగిలినవి.

మోహ—జీవించునా?

వర—ఏమో యెవ్వరు చెప్పగలరు! దైవమే మన కిప్పటిన శరణ్యము. ధైర్యమును వీడకుడు. నాచేతనైన సహాయముచేసెద. తరువాత మీయదృష్టము.

అంత నాతడు తనప్రభానముచే నాసీసపుగుండ్లను హృదయకోశమునుండి తీసివేసి నీటిలోవేసెను. రత్నలాలు శరీరమంతయు నొక్కమారు రక్తసిక్తమైపోయెను. వెంటనే డాక్టరు మందును నడపెను. రక్తమాగినది. మంటతగ్గుటకు గూడ మందునిచ్చెను. రత్నలాలు మరియొక వైపునకు పొరలెను. అందఱు నాశతో నిరీక్షించుచుండిరి. రత్నలాలు కొన్ని యస్ఫుటవచనములు పలికెను.

రత్న—ఏం—ప్రసాదుడా — వచ్చి — నాకు—యిట్లా—వుం—ఏం—చేసిన—తమ—దయ

ఇక మాటాడజాలకపోయెను. ఒక అరగంటకు మరల కనుల దెరచెను. దాహము కావలెనని సంజ్ఞచేసెను.

వర—బాబూ! నీకెట్లున్నది! బాధయేమైన దగ్గినదా?

రత్న—ఏం—తగ్గ—ఇక—నే—బ్రతు—జాల—మోహనా! మోహనా—పర్తు—జాగ్రత—నాపే—నిల్పుము.

వరప్రసాదుడు నాడినిపరీక్షించెను. లలాటము గుంచించెను.

వర—మోహన్‌లాల్! అపరాధపరిశోధకుని, పోలీసు కమీషనరును బిలువబంపుము అత్యావశ్యకము. ఏవిధమైన యాలస్యమును కూడదు. బ్రదుకుట దుర్లభము.

మో—ఇదివరకే కావించితిని. ఆ పరిశోధకుడే కమీషనరును గూడ పిలచుకొని వచ్చును. ఈసరికే వారందఱు వచ్చుచుందురు. డాక్టరుబాబూ! మాకొంప నిలుపుము. శక్తికొలది పనిచేయుము. ఇంతలో బహిర్ద్వారము వద్ద నెవ్వరో "రత్నలాలు గృహమిదియేనా" అని యడిగిరి. మోహన్‌లాలు లేచి నిలువంబడి తొంగిచూచెను. ఇంతలో రమాకాంతుడు, నాతని మేనల్లుడు గౌరీశంకరుడును, పోలీసు కమీషనరు రాజరత్నమును వచ్చిరి. మోహన్‌లాలు లలాటమును గుంచించెను. అది రమాకాంతుడు గనుపెట్టకపోలేదు.

వర—రమాకాంతా! ఆలసించితివి కబురందలేదా?

రమా—కబురేమిటి—కబురు నాకు రానేలేదు. నేను ప్రొద్దుననే రాజరత్నము యింటికిపోవ ఆతడు రాత్రి యానంద కుటీరమువద్ద నెవ్వరో పోరాడిరనియు నెవ్వరినో తుపాకితో గాల్చిరనియు నది చూచిన రామనాధము చెప్పినాడట. ఆ చనిపోయినది రత్నలాలువలె నున్నాడని కూడ జెప్పినాడట. ఆసంగతి యంతయు రాజరత్నము చెప్ప నేను నామేనల్లుడాతనితో గలసివచ్చితిమి.

వర—మోహనా! కబురంపలేదేమి?

మో—కబురుపంపినవా డాలస్యమొందైన జేసియుం డునేమో—

అంత రత్నలాలు రమాకాంతునకు రాత్రి జరిగిన భయంకర హత్యావిధాన మంతయు బూసగ్రుచ్చినట్లు చెప్పెను. ఆతడు చెప్పిన దంతయు రాజరత్నము లిఖిత పూర్వకముగా దీసికొని మోహన్‌లాలుచే దస్కతు చేయిం చుకొనెను. రమాకాంతు డాలోచించుచుండెను.

రమా—డాక్టరు బాబూ! ఏమి యాలోచించు చున్నారు?

వర—నమ్మకము లేదు. ఈతని శరీరము వాతగతి తిరిగినది.

రమా—మోహన్! ఏల యాలసించెదవు. మరణ శాసనము వ్రాయించి దస్కతు చేయింపుము. తరువాత విచారించిన ప్రయోజనము లేదు.

కలమును కాగితమును దీసికొని న్యాయవాది లోకే శ్వరరావుచేత మరణశాసనము వ్రాయించిరి. అందు రత్న లాలు భార్యకు ముప్పదిలక్షల రూప్యములును, వలపుల రాణికి రెండులక్షల రూప్యములును, హంతకుల గనుగొనిన తరువాత, యపరాధపరిశోధకునికి పదివేల రూప్యములును, మిగిలినదంతయు మోహన్‌లాలునకును జెందునట్లును మరణ శాసనము వ్రాయించి యాతనిచే దస్కతు చేయించిరి. పది

నిముసముల పదపడి రత్నలాలుముఖము వివర్ణమై పోయెను. కనులు మూతలుపడియెను. శ్వాస దీర్ఘముగా జరుగుచుం డెను. వరప్రసాదుడు నాడిచూచి యాతనిక్రింద బరుండ బెట్టుమనియె. అందఱు పెద్దపెట్టున యేడ్చుచుండిరి. రత్న లాలు చనిపోయెను!!!

3

మన కథాకాలమునాటికి రమాకాంతుడే బొంబాయి నగరమున బ్రసిద్ధిజెందిన పత్తేదారుడై యుండెను. ఆతనికి సుమారు ముప్పదివత్సరము లుండును. చామనచాయగ నుండును. సుమారారడుగుల పొడుగుండును. విశాలవక్షముతో విరాజిల్లుచుండును. ఆతడు ధూమపాన మద్యపానములు జేయడు. ఆతనిభవనము విశాలమైనది. ఆతనిభార్య యన్నపూర్ణమ్మ సత్స్వభావముగల పతివ్రత. భర్తృశుశ్రూష యామె గుణసంపదను ద్విగుణీకృతము జేయుచుండెను. ఆ దంపతుల యన్యోన్యానురాగము సుఖదాంపత్యము వేనోళ్ళ చిలువలై నను బొగడశక్యంబుగాదు. ఆతని మేనల్లుడగు గౌరీశంకరుడు పట్టపరీక్షయందు త్తీర్ణుడై రహస్యభేదనశాస్త్ర మభ్యసింప వలెనని కుతూహలముచే దన మేనమామ వద్దనేయుండి యపరాధపరిశోధనలలో నాతనికి దోడ్పడుచుండెడివాడు. రమాకాంతునకు గూడ దన తదుపరి

యాతనినే యాయూర ప్రసిద్ధ పత్తేదారుని జేయవలెనని సంకల్పము. రమాకాంతునకు సదా యపరాధ పరిశోధనమే ముఖ్యమైన పని. దానివల్లనే యాతను వేలకొలది ధన మార్జించెను. రత్నలాలుహత్య యాతని మనస్సు నంతయు గలచి వైచుచుండెను. ఆత డెప్పు డిట్టి యసందర్భ హత్యారహస్యమును పరిశోధించలేదు. ఎప్పుడును నింతటి గొప్పబహుమతి యాతనికి చేకూరలేదు. రత్నలాలు హత్యయం దాతనికి చేకూరినది యొక్క నిదర్శనము. ఆతడు తన శయనాగారమున నొంటిగ గూర్చుండి తన జేబునుండి యా సీసపుగుండ్లను దీసి పరిశోధింప మొదలిడెను. ఇంతలో గౌరీశంకరు డచ్చటకు వచ్చెను.

గౌరీ—మామా! ఏమి యాలోచించుచున్నారు?

రమా—హత్యసంగతియే.

గౌరీ—నిదర్శనము లాగుండ్లేగదా?

రమా—ఈగుండు కుంకుడుకాయయంత యున్నది. కాన యిది రివాల్వరుదిగాని పెద్దతుపాకీది గాదు.

గౌరీ—పెద్దతుపాకీది యెంతయుండును?

రమా—అది యుసిరికాయంత యుండును. ఈగుండ్లు మిక్కిలి వాడినట్లు లేదు. నిన్ననో లేక మొన్ననో కొనబడి యుండును. ఇవియంత బరువుగ గన్పడవు. దీనివలన హంతకుల చంపదలచుకొని రాలేదు. భయముపెట్టుటకును, అపా

యము వచ్చిన దప్పించుకొనుటకును వచ్చియున్నారు. (త్రిప్పి చూచి) దీనిమీద యింగ్లీషు అక్షరములున్నవి V. R. అను సంకేతాక్షరము లున్నవి.

రమాకాంతుని మోమున కౌతుకము తాండవ మాడెను.

రమా—గౌరీ! వెళ్ళుదము పద.

గౌరీశంకర—ఎక్కడకు?

రమా—ఎక్కడ కందువేమి? పురపాలకసంఘమునకు.

గౌరీ—ఎందుకొఱకు?

రమా—ఈయక్షరములు సంకేతముగాగల తుపాకీల దయారుచేయుషాపు యెవరిదో యెక్కడనున్నదో దానిపేరేమో కనుగొందము. దానివలన మనచుక్కడకు పోయిన వారిపట్టికలలో దాని నెవరు కొన్నది కన్పడును. ఆకొన్న వారివద్ద కప్పుడువెళ్ళిన మనకారగము నెఱవేఱగలదు.

అంత వారు పురపాలక సంఘమునకు వెళ్ళిరి. గుమాస్తావద్దకుబోయి షాపులవారిపేరుల నడిగెను. కాని యీసంకేతముగల తుపాకీషాపెందునను వారలకు గన్పడలేదు. వారియాశ లడుగంటినవి. వెంటనే వారక్కడనుండి పోలీసుకర్మాలయమునకు బోయిరి. వారు వెళ్లుసరికి రాజరత్నము కూర్చుండియుండెను.

కమీ—రమాకాంతా! నిదర్శనము లేమైనదొరకెనా?

రమా:—ఇది పత్తేదారుపని మఱునాడే హంతకులు పట్టుపడుదురా-ఇదియేటిమాట?

కమీ—హత్యాస్థలమువద్దకు బోయి చూచితిరా?

రమా—లేదు. మీరుకూడవచ్చిన బోవుదము.

అంత వారు హత్యాస్థలమును, జూడనేగిరి. అచిర కాలంబులోనే వారు మలబారుహిలురిడ్జివీధిలో నానందకుటీరమునకు సమీపమందు దిగిరి. ఆయుద్యానమంతయు నత్యంత శిధిలస్థితియం దుండెను. ఆ మందిర శ్వేత ప్రాకారములు సగమువరకు పైభాగము క్రిందపడి యవ్వాట్లపై జమ్మిపిల్లచెట్లు అక్కడక్కడ మొలచియుండెను. దానిని నొకరొకడు సదా రక్షించుచుండును. రమాకాంతుడు మున్ముందుగా నాతని వద్దకు వెళ్ళెను.

రమా—రోశిగా! బాగున్నావటరా.

రోశి—బాగానేవున్నాను బాబూ.

రమా—నిన్నరాత్రి యిచ్చట నేదైనపోరాటము జరిగియున్నదా? నిజము తెల్పుము.

రోజు—ఎందరోనండి! రాత్రిరెండుగంటలకు ఇక్కడ చాలసేపు తుపాకులగాల్చుకొని పోరాడిరి. అంత నేను నిద్ర నుండి మేల్కాంచి నల్దిశల బరిశీలించి తుదకు భయపడి పరుంటిని. ఇంతకన్న నెక్కుడు నాకేమియు దెలియదు.

రాజరత్నం—రోశిగా! నేనెవ్వరినో యెఱుంగుదువా! నేను పోలీసుకర్మచారిని. ఈతడు పత్తేదారుడు.

రోశిగాడు భయకంపితుడై పోయెను. చెమట గ్రుమ్మరించెను. దేహము వణకజొచ్చెను. ముఖము వెలవెలబారెను.

రాజ—భయపడకుము. ఉన్నసంగతి చెప్పుము.

రోశి—అయ్యా! బాబూ! ఇంతకన్న నాకేమి తెలియదు.

రమా—నిన్నపవలుగాని, మరిరెండుదినములకు ముందుగాని యిచ్చట కెవ్వరైన వచ్చియుండిరా?

రో—లేదు బాబూ—ముసలివాడను నన్నెందుకు బాధించుతారు. ఇది వాస్తవము.

రమాకాంతు డక్కడనుండి నల్దిశల బరిశీలింప మొదలిడెను. ఆత డిట్లని తలపోసెను. "ఈమలుపులోనె హంతకులువచ్చి హత్య చేసిరి. అచ్చట గాజుపెంకులు గోడమీద నూడిపోయినవి. దానివలన వారు లోననుండియే వచ్చియుండిరి. లేదేని బయటనుండి లోనకు వెళ్ళినప్పుడైన గల్గును. కాని యిది జరుగనేరదు. హంతకులకు రోశిగానికి యెట్టిసంబంధమును లేదు. ఉన్న వీరు గోడ దుమికి. వెళ్ళవలసినంత యవసరములేదు. ఇదియే నిశ్చయము.

అంత నాతడు సమీపమందున్న ప్రతిస్థలమును వెదకజొచ్చెను. అదృష్టవంతుని చెరుపువారెవ్వరు! అచిరకాలంబులోనె యాతని కొక ఛాయాపటము దొరకెను. దానిపైన V. R. అను సంకేతముండెను. ఇంతియేగాక యాతని కొక

చేతిరుమాలు దొరకెను. అద్దాని చివరలగూడ V. R. అను నాంగ్లసంకేతము లొకేవిధముగ నుంటజేసి యాత డాశ్చర్య చకితుడై పోయెను. ఆతడు వలపులరాణిని జూడవలెనని వెళ్ళుచు రాజరత్నమును మిగిలినవారల బంపివైచి శీఘ్రగమనంబున వెడలిపోయెను

౮

రమాకాంతుడు వచ్చునప్పటికి వలపులరాణి తనగది యందు గూర్చుండి యేదియో యాలోచించుచుండెను.

రమా—వలపులరాణీ! ఏమి యాలోచించుచున్నావు?

వల—జరిగిన సంఘటనముగూర్చి యాలోచించు చుంటిని.

రమా—హంతకుల నేమాత్రమైన గుర్తించలేదా?

వల—గుర్తుపట్టిన జెప్పనా?

రమా—నే నడుగు ప్రశ్నలకు సదుత్తరంబుల నిమ్మా.

వల—అడుగుడు. ఇప్పుడేవచ్చెదను. బాయమ్మగా రెందులకో పిలచుచున్నారు. వెళ్ళకుడుసుమా! అని యామె యటనుండి వెడలిపోయెను. వలపులరాణి యేమైన నిదర్శనములు చెప్పనేమోయని రమాకాంతునకు ఆశవొడమెను. ఆత డాగదిబయలకువచ్చి యంతయు బరీక్షింప మొదలిడెను. అచ్చట నొక చిన్నపేటికయందు మందుసీసా యొకటి

యాతనికి లోచనగోచరంబయ్యె. వెంటనే యద్దాని గైకొని చూడ దానిపైన "రాజారావు కల్యాణనగరము" అని యుండెను. ఆతడాలోచింప మొదలిడెను. దాని బిరడాదీసి లోనజూచెను. అంతయు పసరు—వనమూలికలనుండి తీసిన పసరు—కాన్పించెను. ఆపసరును దయారుచేసినది యా రాజారావని యాతఁడు గ్రహింపక పోలేదు. ఇంతలో వలపుల రాణి యచ్చటకు వచ్చెను.

వల—అయ్యో! ఏమో యడిగెద మనినారే!

రమా—కోపగించుకొనకుము. రత్నలాలునకు బూర్వము వాస్తవముగ నీవెవ్వరియొద్ద నుంటివో చెప్పుము నిజవృత్తాంతము జెప్పిన నిద్దరకు లాభమే.

వల—నేనిదివఱ కెవ్వరి యాశ్రయమున నుండలేదు.

రమా—నీ వయ స్సెంతయుండును?

వల—పదునెన్మి దేండ్లుండును.

రమా—ఇంతదనుక నెవ్వరియాశ్రయమున నుండ లేదనిన నమ్మకము నాకుండునా?

వల—రత్నలాలునకు బూర్వము నేను బిజూరులో నుంటిని.

రమా—అక్కడ నీకు సంరక్షకు లెవ్వరు?

వల—మాయమ్మయే.

రమా—మీయమ్మ పేరేమి?

వల—అలివేణి.

రమా—మీపుట్టినస్థల మెయ్యది ?

వల—పునహా.

రమా—అచ్చట మీకేమైన గృహములుగలవా ?

వల—ఇదివరకొక యిల్లుండెడిది. కాని యిప్పుడమ్మి వేసితిమి.

రమా—జీవనమేమి ?

వల—పాటకచేరీలపైన.

రమా—అలివేణి చేయుచుండెడిదా ?

వల—ఔను.

రమా—మీయమ్మ యిప్పుడెవరిని బెండిలియాడినది?

వల—జిజూరులోనున్న గోపాలరావను నతనిని.

అంతలో నాతడు తనదగ్గరనుంచి యొకఛాయాపటము దీసి చూపెను. ఆమె యాశ్చర్యభావమును మాటుపరచు చుండెను. రమాకాంతుడు కనుపెట్టకపోలేదు.

రమా—ఈపటము నీదికాదా ?

వల—ఇది నాదికాదు.

రమా—మరియెవ్వరిది ?

వల—ఇది మాయమ్మ యలివేణిది.

రమా—కాదుకాదు. ఇది నీపటమే. అబద్ధమాడు చున్నావు. నే నెవ్వరినో యెఱుంగుదువా! పత్తేదారుడను.

వల—ఐనభయమేమి ?

రమా—నీవు నిజముచెప్పకున్న నిన్నే దోషిగా నెంతును.

వల—ప్రమాణము లెవ్వి ?

రమా—ప్రమాణములకు కొదువయేమి? కావలసి నన్ని యున్నవి.

వల—ఇప్పుడు నేను దోషి నేనా !

రమా—కొలదికాలములో నిస్సంశయముగ నట్లే యగుదువు.

వల—(ఆలోచించి) ఇది నాపటమే.

రమా—ఎచ్చటతీసిరి ?

వల—బిజూరులోనె.

రమా—ఎవరుతీసిరి ?

వల—మాయమ్మ మేనత్తకుమారుడు తీసినాడు.

రమా—ఎప్పుడు తీయించుకుంటివి ?

వల—నాజన్మదిన మహోత్సవ సమయమున.

రమా—ఆతనిపేరేమి ?

వల—వినోదరావు.

రమాకాంతుడు పటముపైనున్న V. R. అను సంకేతాక్షరములు వినోదరావునకు సరిపోయెను.

రమా—ఇప్పుడు నీవబద్ధము చెప్పిన దెందులకు ?

వల—నేనద్దాని గుర్తించజాలకపోయితిని. తరువాత బాగుగా పరిశీలించినతమపరి తెలిసికొంటిని. రమాకాంతా! నేను దోషినా?

రమా—నే నంటినా!

వల—మీయభిప్రాయ మట్లుండుటవలన ననుకొంటి.

రమా—నీవబద్ధ మాడుచుంటివని నిన్ను బెదరించితిని గాని నీవు నిజముగా దోషివని నేనంటినా!

వల—ఇంకేమి కావలయునో యడుగుడు.

రమా—నా కింకేమియు నక్కరలేదు. కావలసిన సాక్ష్య ముండవలయును.

వల—దేనికి?

రమా—రత్నలాలు హత్యలోను—నీవు చెప్పినదాని లోను—

వల—సరేలెండి.

అంత రమాకాంతు డింటికి వెళ్ళి భోజనము చేయుచుండెను. ఇంతలో గౌరీశంకరుడు అచ్చటకువచ్చెను. ఇద్దరును చాలసేపు మాట్లాడిరి.

౫

కల్యాణనగరము బొంబాయిపట్నంబునకు సుమారొక నూరు మైళ్ళుండును. కళ్యాణనగరమంతయు జనులకు మహోత్సాహసంజనకమై దర్శనీయమై యలరారుచుండును,

వింతభవనము లులెక్కకుమిక్కుటము. ఆనగరశోభనునాపత్త నమందున్నపూదోటలుద్విగుణీకృతము జేయును. రథ్యలుకడుం గడు విశాలములు. రాజారావు భవనము కల్యాణనగరము చివర పూదోట మధ్యమున నుండెను. శీఘ్రకాలంబులోనె రాజారావు గృహంబున కత్తరులమ్ము వర్తకు డొకడువచ్చి మాట్లాడుచుండెను. అతడే రమాకాంతుడు! ఆయింట రాజా రావొక పడకకుర్చీయందు కూర్చుండి ధూమపానము చేయు చుండెను.

రమా—ఏంబాబూ! అత్తర్లు కావాలా?

రాజా—ఏం అత్తర్లున్నవి.

రమా—రోజినియాఅత్తరు—చందినీయత్తరు—

రాజా—చందినీ యేలాగు.

రమా—తులం పదునైదురూకలు.

రాజా—చాలధర.

రమా—మాది మైసూరు. ఈయత్తరు మేమే స్వ యంగా తయారుచేయుచున్నాము. ఇందులో జెరుపేమియు లేదు. అంతా నిఖార్సది. రమాకాంతు డంతట తనపెట్టెలో నొకసీసానుదీసి క్రిందపెట్టెలోన వెదకజొచ్చెను. మరియొక చిన్నసీసా తీసెను. దానిలో చందినీయత్తరుండెను. ఇంతలో రాజారా వక్కడ ప్రథమమునసుంచిన పెద్దసీసాను దీసికొని చూచెను. చూడగనే యాతనిముఖము వెలవెలబారెను.

విపన్నము చెందఁజొచ్చెను. ఆశ్చర్యచకితుఁడై పోయెను. రమా కాంతు డద్దాని ప్రతిక్షణమును గనుపెట్టుచుండెను. వెంటనే యాతడు తన చందినీసీసాను దీసికొని—

రమా—ఇదిగోనండి.

రాజారావు రమాకాంతుని దేరిపార జూచుచుండెను. తీక్ష్ణ ప్రసారము మదమత్తేభ కుంభయుగళస్థ భయంకర హార్యక్ష నిశితలోచన తీక్ష్ణతను నోడించెను. లలాటమును గుంచించెను. కనులర్ధస్ఫుటమ్ముగ దెరచి క్రిందికి దేరిపార జూచెను. ఇది యంతయు రమాకాంతుడు గనుపెట్టక పోలేదు. అతనివృత్తి, యభినయము, భావజాలములు ఇవన్ని యు రమాకాంతున కనుమానాస్పదములుగ నుండెను. ఆసీసా యంతయు పచ్చని పసరుతో నిండియున్నది. దానినే రమా కాంతుడు మోహన్‌లాలు యింటివద్ద వలపులరాణితో మాట్లాడుటకు వెళ్ళినపుడు చూచి కైకొనినది. దానినే రాజారావు చూచి నిశ్చేష్టితుడై యుండెను. రమాకాంతు డిట్లాలోచించెను. "రాజారావే యీపసరును తయారుచేసి యుండును. ఇది యేమో చాల రహస్యమైనదియై యుండ నోపు. లేదేని రాజారా వెందులకు నిశ్చేష్టుడు గావలెను. ఈతడు హత్య చేసియుండునా యేమి, చేసినయెడను నుండును, లేదా హంతకులతో సంబంధముండును. ఇంకను యీత డేమి పల్కునో చేష్ట లెట్టివియో గన్పెట్టెదను" అని యాతడు తీవ్రముగా నాలోచించె.

రమా—తీసికొంటారా ?

రాజా—తీసికొనిమెదను నీ చేయూరు ?

రమా—మాది బెల్గాం.

రాజా—నీపేరు ?

రమా—నాపేరు పేకుమస్తాన్.

రాజా—నీ వేంపని చేస్తావ్ ?

రమా—అత్తరు లమ్మటమే. ఇంకేమి యుద్యోగ మున్నది. అప్పు డప్పుడు వైద్యం జేసేది.

రాజా—వైద్యం తెలియునా ?

రమా—తెలియును. కాని చాలాడబ్బు అత్తరు మీదనే లాభం యెక్కువ.

రాజా—నేనుగూడ వైద్యం జేస్తాను. నీవు నాకు తోడ్పడుతావని యడుగుతున్నాను.

ఇంతలో అక్కడకు మరియొక నూతనవ్యక్తి వచ్చెను. రాజారా వతనివంక జూచెను. ఆ నూతనవ్యక్తి యేదియో కనుసన్న జేసెను. అది రమాకాంతుడు కనుపెట్టెను. ఆతడు గన్గానజాలకుండెనని వా రనుకొనిరి.

రాజా—సరే; తులం యిచ్చిపొమ్ము ఈ సీసాయేమి?

రమాకాంతుడు ప్రత్యుత్తరంబున కాలోచించెను.

రమా—అయ్యా ! యిదియొక పసరు. గాయముల కమోఘమైన యౌషధము.

రాజా—నీ వెవ్వరివద్ద తీసికొంటివి ?

రమా—బొంబాయిలో రాజారావను నతనివద్ద గొంటిని.

రాజా—ఏ రాజారావు?

రమా—కోమటి పిల్లవాడండీ.

అంత రమాకాంతుడు తులం చందినీయత్తు రిచ్చి రూకలు గైకొని యిల్లు వెడలెను. అంతకు పూర్వమే గౌరీ శంకరుని రాజారావు తోటమాలిగా నియమించి యుండెను. మధ్యాహ్న మొంటిగ నాతనితో బ్రసంగించి సాయంకాలము నకు యింటికి జనెను.

౬

రమాకాంతుడు ఇంటికి వచ్చునప్పటికి యాతని కొక యుత్తరము వచ్చియుండెను. దానిని చేతగైకొని యిట్లు చదువుకొనెను.

"రమాకాంతా! నీపేరు మేము వినియుంటిమి గాని నిన్నెన్నడు జూడలేదు. నీవిప్పుడు బొంబాయిలోని యపరాధ పరిశోధకాగ్రగణ్యుడవని యందరు నమ్ముచున్నారు. వారు కేవలము మూఢులే. ఎందుకన; నీవంటి మూఢుని, తెలివిలేని వానిని, ఆలోచనాహీనుని, యమాయకుని, నొక గొప్పరహస్య భేదకుడనుచు, నపరాధ పరిశోధకాగ్రగణ్యు డంచును నెంచు చున్నారు గనుకనే నీకు రహస్యభేదనమందు తెలివియున్నదా-

అదియే శూన్యము. నీమేనల్లు డెక్కడనున్నాడో మాకు దెలియును. వానిని సాధ్యమైనంతవరకు యీపూట కారాగృహంబుననో లేక యమసదనంబందునో పడవేయగలము. శీఘ్రముగ నీవు కూడను నాతని గలుసుకొనునట్లు చేయగలము. తదుపరి నీభార్య యన్నపూర్ణమ్మను మాయిచ్చవచ్చిన మేలంగు జెరుపుదుము. ఇది నిక్కువము. ఐనను స్నేహితునివలె నీకు కొన్ని హితవాక్యము లుపదేశించెదము. నీవు ప్రథమమున మమ్ముల గనుపెట్టజాలవు. కనుపెట్ట ప్రయత్నింతువు. ప్రయత్నమధ్యమున నీవు కడు కష్టసాగరవీచికాపరంపరల నాపుటకు వారాకరమే లేదు. తుదకు ఫలించు ననుకొందువా, అది స్వప్నవృత్తాంతము. ఫలితమేమన; నీయసువులను, ధనకనక వస్తువాహన దారాసుతస్నేహిత బంధుజాలంబుల పోగొట్టుకొందువు. ఎందుకీయసంబద్ధహత్యారహస్యభేదనకార్యాలోచనము. నీవుకాదు గదా నిన్ను సృష్టించిన యబ్జయోని యైనను మమ్ముల గనుపెట్టజాలడు. నీవంటి రమాకాంతులు పదివేలమంది యైనను మానూతన భయంకర సంఘటనములను దెలుసుకొనజాలరు. కాన నీ వీ కార్యాలోచననుండి వదలుకొనుము. మనస్సును నాతురతతో మైత్రి గల్గింపకుము. ఈప్రయత్నమచిరకాలంబులోనె వదలుము. లేదేని నీ శిరచ్ఛేదనమే నిక్కువమని తలంచి పనిచేయుము.

రాజరత్నం శీరము మూడుదినంబులలో నెగిరిపోవునని చెప్పవలయును. ఆతనిభార్య లక్ష్మీధరపురంబున నున్నదని తెలియును. ఆమె నెట్లయినను గ్రహింతుము. రాజరత్న మూమెను చూడకమునుపే మేము తీసికొని పోదుమని జాగ్రతగా జెప్పవలయును.

మోహన్‌లాలుని జంపవలసినంత యవసరము మాకు లేదు. వలపులరాణి యసలవసరమే లేదు. ఆ భయంకర నారీభూత మా మోహన్‌లా లాశ్రయమందే యుండనిమ్ము. ఆమెను మేము బలాత్కారముగనైన దీసుకొని వెళ్ళలేక పోతేగదా మాకంతతొందర! ఎక్కువకాలము గడపిన యేది యెట్లుపరిణమించునో చెప్పజాలము. గౌరీశంకరునిజంపవలయు.

ఇట్లు,

ఆనందకుటీరమువద్ద హంతకులు.

రమాకాంతు డు త్తరము చదువుచున్నంతకాల మన్న పూర్ణ పెద్దపెట్టున నేడ్వదొడంగెను. రమాకాంతు డూరడించెను. ఆమెదుఃఖ మాగనేలేదు తుదకు—

రమా—ఎంతచెప్పినను వినవైతివి. నాకు వచ్చు లేఖలు నీవెందుకు విప్పితివి. అందులోని సంగతుల నెందుకు జూచితివి. అది మంచిపని యని తలంచుచున్నావు గాబోలు. మగవారిలేఖ లాడువారు సవరింతురా. ఊరకుండుము. ఇక యెప్పు డటుచేయకు.

ఇంత ధైర్యము చెప్పినను, రమాకాంతుని ముఖము భయభావము సూచించుచునే యుండెను. కొంతవడి కాతడు ధైర్యమువహించి యెన్నికష్టములకు లోనైనను దానీహత్యా రహస్యమును భేదించనిది వదలనని శపథము గావించు కొనెను. వెంటనే భోజనముచేసి తాను యివ్వనిదే యేయు త్తరమును నమ్మవలదని చెప్పి వెడలిపోయెను. అతని కత్తియు రివాల్వరును అతనియొద్దనే యున్నవి. అతడు కర్మాలయాభి ముఖుడై పోవుచుండెను. అతడు వెళ్ళునప్పటికి రాజరత్నం గూర్చుండి యుండెను.

రామా—రాజరత్నం! ఏమిటియాలోచించుచున్నావు

రాజ—ఏమియులేదు.

రమా—నిన్నటిదినమున గళ్యాణనగరము వెళ్ళితిని. రాజారావును దర్శించితిని. అతడొక మాంత్రికుడును, వైద్యు డును. అతని కీట్లయిన హత్యతో సంబంధ ముండియే యున్నది.

రాజ—గౌరీశంకరు నక్కడ విడచివచ్చినారా?

రమా—ఆతనికొక తోటగలదు. దానికి గౌరీశంకరుని దోటమాలిగ నియమించి వచ్చితిని. ఈదినమున నొక యనా మక లేఖ వచ్చినది.

అంతట రమాకాంతు డాలేఖ నాతనికిచ్చెను. రాజ రత్నమద్దాని నామూలాగ్రముగ జదివెను. ఆతడు భయ భ్రాంతుడై పోయెను. ఆతనికి యాలోచన నొడముట లేదు.

రాజ—రమాకాంతా! ఏమిటాలోచించితివి?

రమా—ఈదినమున గౌరీశంకరు నేమైన బాధించుదునా?

రాజ—అట్లు జరుగదనియే నానమ్మకము. హంతకులు మిమ్ముభయపెట్టుటకే యట్లుగావించిరిగాని మరేమియు గాదు. హంతకులు చూడ పిరులువలె నున్నారు.

రమా—ఈసింహదంష్ట్రిల కాయజములు చిక్కక పోవునా? తాటాకులచప్పుళ్ళకు కుందేళ్ళు బెదరునా? హంతకుల బట్టుకున్న నేను రమాకాంతుడనేగాను. ఇక నేను శ్రీఘ్రగమనంబున బోవలయు. తిరిగి కొన్ని విషయంబుల బరీక్షించి నాలుగుదినంబులలో వచ్చెదను. అవసరమైన దంతివార్త యిచ్చెదను. వెంటనే సహాయము బంపవలయు మాయింటి వద్ద జాగ్రతగ జూచుచుండవలయు. అని యాతడు కళ్యాణ నగరము వెడలిపోయెను.

౭

రమాకాంతుడు ప్రొద్దుగ్రుంకువరకు నటునిటు దిరిగి కనుచీకటి నల్దిశల నలముకొనిన తమసరి రాజారావుతోట యగువిశాలోద్యానము చేరెను. బైటనుండి జయసీతారాం అనెను. అదియే వారల సంకేతము. గౌరీశంకరుడు తోటలోని ద్వారముతీసెను. రమాకాంతుడు లోనజొచ్చెను.

రమా—గౌరీ! భద్రముగనుంటివా?

గౌరీ—మామా! ఇదేమి మరలివచ్చితిరేమి?

రమా—నాకొక యనామక లేఖవచ్చినది, హంతకులు నిన్ను బాధింతురని వ్రాసిరి. వారిబారినుండి నిన్ను దప్పించుటకు యిచ్చటికి వచ్చితిని.

గౌరీ—వారలా! వారు నన్నేమియు చేయజాలరు. ఐనను రాజారావు దొంగవలెనున్నాడు, హంతకులలో యీతడొకడు. ఈదినమున మానవవశీకరణ మూలికారసము తీసుకొనివెళ్ళినారు. ఏమిచేతురో కదా మూర్ఖులు!

రమా—మానవవశీకరణ మననేమి?

గౌరీ—ఆపసరు వీపుమీద చల్లిన యావ్యక్తి ప్రయోగముచేసినవానికి వశమగును.

రమా—రాజారావింట లేడా?

గౌరీ—లేడు. ఈమధ్యాహ్నమే వెళ్ళినాడు.

రమా—ఎప్పుడు తిరిగివచ్చును?

గౌరీ—ఈదినమే వచ్చును.

రమా—మోటారున్నదా?

గౌరీ—లేదు. ఈరాత్రికి బంధువులెవ్వరో వత్తురనియు వారలకు దగినసాయమొనర్పుమని యాజ్ఞాపించి వెడలినాడు. ఈదినమిక్కడనే యుండుడు.

రమా—నేనిక్కడ నీకు దోడ్పడుదమనియేకదా వచ్చితిని. వచ్చు బందుగు లెవ్వరు?

గౌరీ—ఎవ్వరెఱుంగుదురు! వారిలోహంతకులుందురు.

రమా—రాజారా యీదినమున రాడు?

గౌరీ—రాకేమి నాలుగుగంటలబండికి వచ్చును.

అక్కడ నొకచోట పదధ్వని వినంబడజొచ్చెను. రమాకాంత గౌరీశంకరు లాదిక్కుకై వెడలిరి. అంతయు నిశ్శబ్దము. మహీరుహశాఖాపత్రములు సంచరించినపుడును, వృక్షశాఖలందున్న కులాయంబులబడి నిద్రించుచున్న విహంగ సముదాయము మధ్యమధ్య మేల్కాంచుచు కలకలస్వరం బులు జేయునప్పుడును, నిశ్శబ్దముకు భంగముగలుగుచుండెను. బ్రహ్మాండభాండమంతయు నంధకారబంధురంబై యుండెను. అందులో మూఢహృదయంబుపోల్కినిగూఢంబై యున్నలతా గుల్మములచేతను, బహువింశతివత్సరంబులనుండి యలము కొనిన వటవిటపివితానంబులతోడను, సకలవిధలతాసుమ భరితకుసుమని కుంజపుంజములతోడను, నమూల్యప్రభావ సమాకర్షిత వనమూలికా నిచయంబులతోడను విరాజిల్లు నావనమందు నంధకారము యిచ్చవచ్చినతెరంగున పెచ్చు పెరిగి యచ్చుబోసిన యాబోతుభంగి ద్రిమ్మరుచుండెను. ప్రకృతికాంత ధరియించిన వినీలాంబరమున మినుకు మినుకు మనుజల్తారు పువ్వులోయన నీరంధ్రప్రకల్పిత గాంఢాంధకార మున మింటచుక్కలునిర్మలకాంతులు దశదిశల బ్రసరింప జేయుచుండెను.

అట్టితఱి నావనమందు నెవ్వరోముగ్గురు వ్యక్తు లొక దెసపోవుచుండిరి. వారిచేతులలో రివాల్వర్లు లేకపోలేదు.

గౌరీ——మామా! మనము వారి ననుసరింతము.

రమా——వా రెక్కడకు బోదురని?

గౌరీ——వా రా వెనుకనున్న భూగృహములోనికి పోదురు.

రమా——ఈతనికి భూగృహ మెందులకు?

గౌరీ——ఈతని యౌషధములన్నియుదానిలో దాచి యున్నాడు. అదిగాక అది యీతనికి రహస్యాలోచనాగారము. ఇతరుల నెవ్వరను రా నివ్వడు.

రమా——వారు లోనకు బోయి తలుపు వైచుకొనిన—

గౌరీ——దానిని దెరచుమార్గము నాకు తెలియును.

అంత వారిద్దరు వారి ననుసరించిరి. ఆవ్యక్తు లక్కడ నొకభయంకరశునకమును నియోగించి లోనకు జని కవాట ముల బంధించిరి. రమాకాంతు డాకుక్కను అరచుటకు దగి నంతయవకాశ మీయకుండగనే కంఠము నులిమివైచెను. గౌరీశంకరు డింతలో నక్కడనున్న మీటనొక్కి తలుపు తెరచెను. వెంటనే వారక్కడనున్న సోపానముల నధిరో హించి వెడలిరి. లోపలనొక గదిలో నాముగ్గురువ్యక్తులు కూర్చొని మాట్లాడుచుండిరి. రమాకాంతగౌరీశంకరు లక్కడ తలుపుచాటున నిలువంబడి చెవియొగ్గి వినుచుండిరి.

ఒకవ్యక్తి—విశ్వాసరావూ! విశేషము లెవ్వి?

రెండ—ఈరోజున రాజారావును రామరాజును వెళ్ళినారుగా? పని యైయుండును.

మూడ—రహింగూడ వెళ్ళలేదా?

మొద—వెళ్ళినాడు.

రెండ—తోటమాలి జాగ్రతగనున్నాడా! ఆతడేదైన—

మూ—ఆతఁడట్టివాడుగాడు. ఆతడుగూడ మనకు దోడ్పడునని తోచుచున్నది. లేదేని చంపివైచెదమని భయపెట్టెదము.

రెండ—ఈతోడ్పాటుల కేమిగాని యాతని యంత మొందించనియెడల మనకార్యమునకు భంగముకలుగును. రత్నాలాలు హత్యమాట యేమి?

మొద—ఏమున్నది. వారు మనల గన్గొనజాలరు. రమాకాంతుడు ప్రయత్నించుచున్నటుల తెలిసినది. ఆతని జంపనిదే నాకు నిదురరాదు. రేపు పార్కువద్ద గలుతము.

వారు బయటకు వచ్చునటుల తెలిసి రమాకాంత గౌరీశంకరులు దిగి యాయంధకారములో నదృశ్యులైరి.

రమా—గౌరీ! నామనస్సు వ్యాకలన మొందుచున్నది. ఇక నీవీతనియొద్ద నూడిగము జేయనక్కరలేదు. ఇంటివద్ద నేమైనదో దెలియదు. వీరలసంభాషణ వినినదాదిగ రాజా

రావును రామరాజును వెళ్ళి మీయత్త నేదయిన బాధించు దురేమో యను సందేహము వొడముచున్నది. నీవు వెంటనే యింటికి బొమ్ము. అవసరమైన తంతివార్త యిచ్చె దను జాగ్రత.

అంతట గౌరీశంకరుడు వెడలిపోయెను. రమాకాంతుని ముఖ మానందప్రఫుల్లమై పోయెను. ఎందుకన నాతనికష్టము ఫలించు మార్గ మప్పుడే కానవచ్చుచున్నది. ఆతడిట్లని తలంచెను.

"ఇక నేనెంతయో నాలోచింప నవసరములేదు. నిశ్చయముగ రాజారావే హంతకుడు. వీరలంద రాతని స్నేహితులుగాని మరేమియు లేమ. ఈతని బట్టుమార్గ మాలోచించెదను, నిదర్శనము లెవ్వియును లేవే" ఆతడు తనలో దానను కొనునప్పుడు కొన్నిమాటలు బయటకు బెద్దగా బలికెను. అది యాతనికి సహజము. అతని కెచ్చటనో పదధ్వని వినబడినది. వెంటనే యాతడతివేగమున నక్కడి నుండి పారిపోయెను.

౮

గౌరీశంకరు డింటికి వెళ్ళునప్పటికి వీధి కవాటము బంధింపబడి యుండెను. ఆతని కనుమాన మంకురించెను. ఎందులకీ కవాటము బంధించిసదని యాతడు పరిపరివిధంబుల

దలపోసెనుగాని యాతని కెవ్విధమైన దరి గానరాకుండెను. సింహద్వారమువద్ద ముగ్గులులేవు. ధూళి మిక్కుటముగ నుండెను. వెంటనే తలుపును తట్టెను. ప్రత్యుత్తరము లేదు. అనుమాన పిశాచమాతని నావహించినది దానికి దగినమంత్ర మాతనియొద్ద లేదు. ఎంతసేపటికిని రానందున నాతడు తలుపును గట్టిగ దన్నెను. అది యట్టిట్టనరాని గట్టిదనంబు గల్గిన దగుటంజేసి యాతడు సఫలీకృత మనోరథుడు కాజాలక పోయెను. వెంటనే యాతడు మరియొకతన్ను గట్టిగతన్నెను. తలుపులోపలి గడియలు విరిగిపోయి తలుపునిమేషమాత్రమున దెరచుకొనెను. గృహమంతయు చీకటి గౌరీశంకరునికి టత్తరపాటుద్భవించెను. ''అత్తయ్యా''అని బిగ్గరగ నరచెను. జవాబులేదు. దొడ్డితలుపులు తెరచ బ్రయత్నింప నవి బయటకు వేయబడియుండెను. అక్కడనున్న గవాక్షము తెరచెను. ఇల్లంతయు మనుష్యసంచార హీనసూచికాపరిశుద్ధమలమయి యుండెను. అంతయు రజమునిండియుండెను. వెంటనే యాతడయ్యపేటికను దెరచెను. కాని దానియం దెవ్విధమైన వస్తువులు తస్కరింపబడలేదు. గౌరీశంకరుడు నిర్విణ్ణుడైపోయెను. ఆతనికి సంఘటనాద్యంతములు తోచవయ్యెను. ఆత డిట్లని చాలతడవు తలపోసెను.

''హంతకులే మాయత్తను దొంగిలించుకపోయిరి గాని మరేమియుగాదు. దొంగలేయైన గృహములోనున్న భాండ

ములు, యయఃపేటికలో నుండు ఆభరణములు తస్కరించుక పోవలసినది. వారట్లు చేయలేదు గాన హంతకులు ప్రత్యేకముగా మాయత్తను దీసికొని వెళ్ళుటకు వచ్చిరిగాని తస్కరులుగారు. అహో! హంతకు లెంతటిసాహసులు వీరలు ఎంతటి ధీరులు గాకున్న సకలసౌభాగ్యలక్షణ సమన్వితమగు నిబ్బరత సామ్రాజ్యమునం దాంగ్లపరిపాలనమున బొంబాయివంటి మహానగరములో నొక యసహాయ యువతిని దస్కరించుటయా! హంతకులు మాయత్త నెట్టికడగండ్లు పెట్టిదురో గదా! హాతవిధీ! ప్రాపంచిక సౌఖ్యంబు లనుభవించుటకు పతిసేవా పరతంత్రురాలగుటకు స్త్రీల నపరాధపరిశోధకుల దారలుగా సృజింపబోకుము.'' ఐన నిప్పుడాలోచనమునకు తరుణము కాదని తలంచి యాతడు దిగ్గున లేచి దొడ్డి తలుపును లేవదీసి నైచి బయటకు వెళ్ళెను. అచ్చట గోడమీద నొకచో సీసపుపెంకులు నలిగి దానిపై నొక పట్టా పరుపబడియుండెను. వెంటనే యాతడా యింటిచుట్టును దిరుగనారంభించెను. కాని యేమియు నిదర్శనము లభించలేదు. ఆకస్మికముగ నక్కడొక స్త్రీవ్యక్తి యాతనికి లోచనగోచరం బయ్యెను. ఆతడు తత్తరపాటుతో నక్కడకుబోయి "లక్ష్మీ" యని పిలచెను. ఆవ్యక్తి కనులర్థస్ఫుటముగ దెరచెను. ఆమె యొడలంతయు గట్లు కట్టబడియుండెను.

గౌరీ—లక్ష్మీ! ఏమిది యిట్లున్నావు?

లక్ష్మి—బాబూ కట్లు—

గౌరీశంకరు డామెకట్లు వదలించెను. దాహము నిచ్చెను. సేదదీర్చెను. కొంతవడి కామె మాటాడగలిగెను.

గౌరీ—ఏమిసంగతి తొందరగా చెప్పుము.

లక్ష్మి—బాబూ! నిన్నసాయంత్రము రమాకాంతుల వారు యెక్కడకో పోయినారు. నిన్నరాత్రి పదకొండుగంట లకు యెవ్వరో నల్వురువచ్చి మనవాకిటనున్న తిన్నెపై గూర్చుండిరి. అమ్మగారు నన్నుతోడు పడుకొనుమన్నారు. నేను గడపవద్ద పరున్నాను. వారు వచ్చునప్పుడొక యెద్దె బండిపై వచ్చిరి.

గౌరీ—అప్పుడు నీ విది యంతయు నెట్లుకనిపెట్టితివి?

లక్ష్మి—నేను గడపయివతల పరున్నాను. అందు వలన గనుగొనజాలితిని. వారునల్వురలో యిద్దరు గొంత వడికి లోనికివచ్చిరి. ఇద్దరిహస్తములయందు కత్తులు మెరయు చుండెను. నేను భయకంపితనై పోతిని. నోటమాటలేదు. వెంటనే వారు నన్ను చూచి నోటగుడ్డలుకుక్కి కాలుసేతులు బంధించిరి.

గౌరీ—వారెట్లున్నారు గుర్తించితివా?

లక్ష్మి—వారు నల్లబట్టలు కట్టుకున్నారు. తలపాగ నల్లనిదే. వారిని చీకటిలో ముసలిముండను నేను గుర్తించ గలనా.

గౌరీ—వారిచేతులలో నేదైన దీపమున్నదా?

లక్ష్మి—లేదు.

గౌరీ—వారిద్దఱోవనే మరల వెళ్ళిరా?

లక్ష్మి—వారిద్దఱోవ మరలరానూ లేదు—పోవనూ లేదు.

గౌరీ—లోనకు వెళ్ళి తలుపులుమూసిరా?

లక్ష్మి—ఆ!

గౌరీ—వారెంత కాలము లోపలనుండిరి?

లక్ష్మి—సుమారొక యర్ధగంట యుండిరి.

గౌరీ—అప్పటికి పోలీసువారల గస్తీయైనదా?

లక్ష్మి—వీరు వెళ్ళినతరువాతనే వారు వచ్చిరి.

గౌరీ—వారిద్దఱోవ రాలేదుగదా – వారు వెళ్ళినారని నీ వెట్లు కనిపెట్టితివి?

లక్ష్మి—ఒక అర్ధగంట తదుపరి లోనదొడ్డివాకిలివద్ద తలుపు చప్పుడైనది. దానివలన వారు తిరిగి వెళ్లినారని గ్రహించితిని.

గౌరీ—నేను పోలీసుకర్యాలయమునకు బోయి మరల వచ్చెదను. జాగ్రత.

అంత నాతడు పోలీసుకర్యాలయమునకు జనెను. గౌరీ శంకరుని జూడగనే రాజరత్నం నిశ్చలుడై పోయెను. ఏదియో జరిగినదనియే యాతని సంకోచము.

రాజ—గౌరీశంకరా! ఏమి విశేషములు?

గౌరీశంకరుడు కనులనీరు నించెను. అది చూచి రాజ రత్నం స్తంభితుడై పోయెను.

గౌరీ—మాయత్తను నిన్నరాత్రి హంతకులు దొంగి లించిరి.

రాజ—ఎవ్వరు లేరుకాబోలు! దైవమా!

గౌ—మే మెవ్వర మింటివద్దలేము. నన్ను హంతకు లేమైన బాధింతురని యాతడు నావద్దకువచ్చెను. ఇదిచూచి సమయాను కూలముగ నామెను దీసుక పోయిరి.

రాజ—ఇప్పుడేమి కర్తవ్యము?

గౌరీ—రాత్రి మావీధిని గస్తీతిరిగిన పోలీసువాండ్ర బిలువుము. వారలవలన నెట్టియైన జాడలు తెలియునేమో.

అంత రాజరత్నం బహుప్రయాసముమీద నారక్షక భటులను గౌరీశంకరునివద్దకు దీసుకవచ్చెను. ఒకనిని,

గౌరీ—ఓయీ! నీపేరేమి?

రక్ష—నాపేరు వీరాస్వామండీ.

గౌరీ—నిన్నరాత్రి పదునొకండు గంటలకు నీవెక్క డుంటివి?

రక్ష—నేను మింటుబజారున నుంటిని.

గౌరీ—అప్పుడు మాయింటివీధిలో నెవ్వరు గస్తీ తిరిగిరి?

వీరా—ఈతడేను.

రెండ—అయ్యా! నేను పదునొకండుగంటలకు మీ వీధిప్రక్కన వీధిలో దిరుగుచుంటిని.

గౌరీ—మా వీధిలో నేదైన చప్పుడుకాలేదా?

రెండ—ఏచప్పుడును లేదు. కాని నే నామలుపు తిరుగునప్పటికి నాకొక బండి కన్పడినది. నే నద్దానిదగ్గరకు వెడలిచూడ దానికి దీపమడుగున గొంచెముగ శాంతింప మొదలుపెట్టినది. నేను వారల నాబండి యెక్కడకని యడిగితిని. వారు రైలుస్టేషనుకని జవాబుచెప్పిరి. "ఇప్పుడేమి బండియున్న"దని మరల ప్రశ్నించితిని. వారు బరోడారైలుకు పోవుచున్నామని చెప్పి స్టేషనుదిక్కుగా వెడలిరి. నేను నిజమని తలంచి యూరకుంటిని. ఇప్పుడేమి వచ్చినది?

గౌరీ—ఆబండిలో రమాకాంతులవారి భార్య దొంగిలింపబడి తీసుకపోబడినది. ఆబండిలో నెందరు పురుషులుండిరి?

రెండ—ఇద్దరు.

గౌరీ—స్త్రీ లెందరు?

రెండ—ఇద్దరు.

గౌరీ—పొరపాటా, నిజముగానా?

రెండ—నిజముగనండి. అందులో నొక స్త్రీ పరుండియున్నది.

గౌరీ—అది యెద్దులబండియా? లేక గుఱ్ఱపుబండియా?

రెండ—అది యెద్దులబండేనండి.

అంత గౌరీశంకరు డటనుండి యిలువెడలి సాయంకాలమగుసరికి యావృత్తాంత మంతయు దన మామకు జెప్పవలయునని కల్యాణనగరము వెళ్ళెను.

అజాండమంతయు నంధకారసమాకర్షితమై యుండెను రమాకాంతుడు రాజారావుయొక్క విశాలోద్యానమున భూగృహమువద్ద కూర్చుండి యాలోచించుచుండెను. ఆతని వైఖరిచూడ నాతడు గౌరీశంకరునికొఱకు నిరీక్షించుచున్నట్లున్నది. గౌరీశంకరు డింకను రాలేదను శంక యాతని మనంబును గలచివైచుచుండెను. అట్టితరి నావనమం దెవ్వరో యిద్దరు మనుజులు వెళ్ళుచుండిరి. ఎవ్వరైనను సరియే యని తలంచి రమాకాంతుడు వారల ననుసరించెను. వారిలో ననేకమార్లు ఆయిద్దరువ్యక్తులు పత్రంబులు సంచలించినపుడు వెన్కకు దిరిగి చూచుచుండిరి. అట్టి సమయమున రమాకాంతు డేచెట్లుచాటుననో గోడచాటుననో నాగుండెడివాడు. వారట్లు వీరసింగ్ బజారున బోవుచుండిరి. రమాకాంతు డాలసింపక వారివెన్నంటియే వచ్చుచుండెను. వారట్లూరివెలుపలనున్న "పార్క్" వద్దకు వెళ్లిరి. పార్క్ చుట్టును నొక విశాలమైన తోటగలదు. ఆముందువెళ్లుమనుజులను రమాకాంతుడు గనుపెట్టజాలకపోయెను. రమాకాంతు డాలోచింపదొడంగెను. "గౌరీశంకరు డింకను రాలేదే. అన్నపూర్ణను దీసుకవచ్చిరా యేమి హంతకులు. గౌరీశంకరు డేమైన వర్తమానముల దీసుకొని భూగృహమువద్దకు రానతనిబట్టి బంధించిరేమో! ఆత డట్లు బంధింపబడువాడు

కూడ కాడే. ఐనను వీరు పార్కువద్ద కెవ్వరికొరకో వెళ్ళుచున్నట్లున్నది. అక్కడ నింక నెందరు కూర్చుండిరో పరీక్షించవలయును.'' అని పరిపరివిధముల దలపోసి వారివెన్నంటి పోవుచుండెను. రాత్రి తొమ్మిదిగంటలన్నర యైనది. వారు పార్కులోనకు వెళ్లిరి. వారు వెళ్ళునప్పు డదృష్టవశమున తెరవబడియే యుండెను. రమాకాంతుడు లోనకువెళ్ళెను. ఆమనుజులు లోనయున్న భవనపు తిన్నెపై గూర్చుండిన మువ్వురు మనుజుల దగ్గరకు జనిరి. కదలక మెదలక రమాకాంతుడు గుప్తముగ నొక మల్లెపొదచాటున దాగుకొనెను. వారల సంభాషణమంతయు ప్రత్యక్షముగ రమాకాంతుడు విశదముగ వినుచుండెను.

మొద—పనియైనదా ?

రెండ—రామరాజు వెళ్ళుట, పని గాకుండుటనా.

మూ—రామరాజూ ! నీవును మరెవ్వరు వెళ్ళినారు?

నాల—నేనును ఈరాజారావును వెళ్ళినాము.

ఐద—రహీం రాలేదా ?

రెండ—వచ్చినాడు.

మొద—ఎటులగావించినారో విశదముగ నాకుదెల్పిన సంతసము.

రెండ—వెళ్ళి యరుగుపై గూర్చుంటిమి. అక్కడ నొక ముసలిముండయున్నది. అది యరచునేమో యని దానినోట గుడ్డలుకుక్కి బంధించితిమి. ఆమె యప్పుడు

మేల్కాంచియే యుండెను. పెడరెక్కలు విరచి త్రాళ్ళచే గట్టివైచితిమి. రహీమును వాకిట నిలువబెట్టి నేనును కామరాజును లోనకు వెళ్ళితిమి. ముందుగా నేను మానవవశీకరణ మూలికారసమును జేబులోనున్న డబ్బీనుండి తీసి సిద్ధముగా నుంటిని.

మొద—కవాటము బంధింపబడి యుండ లేదా ?

రెండ—లేకేమి ? దానియూత లెత్తివైచితిమి.

మొద—శబ్దమేది కాలేదా ?

రెండ—కాకేమి. శబ్దమైనది. ఇంతలో లోననుండి యొక స్త్రీ నిదురకనుల నులిమికొనుచు వచ్చి తలుపుతీసెను. స్త్రీ యేమిటి దేవకామిని. రంభ. నేను చెడుపని చేయుటకు దగిన యదనుగావని తలంచి యత్యంతశీఘ్రకాలంబున నా వనమూలికారస మామెపై జల్లితిని. ఆమె యరచుటకు దగినంత యవకాశ మీయకుండగనే యొక్కసారి యామె నోట గుడ్డలు కుక్కితిమి. వెంటనే మనరాజు వాకిటతలుపు బంధించినాడు. అటనుండి యామెను భుజంబులపై వేసికొని దొడ్డిపంచపాళితలుపుతీసి దొడ్డిలోనికి వెళ్ళినాము. ఆగోడంతయు సీసపుపెంకులచే గ్రుచ్చబడియున్నది గాన దానిపై నక్కడనున్న పట్టానుపరచి దానిపైనుండి ముందుగా రాజు దిగినాడు. యీయామె నతని కందిచ్చి నేనును దిగితిని. మేము సింహద్వారమువద్దకు వచ్చి యాక్కడనున్నబంఢీలో నామెను

బడవైచి రహీంను బిలచితిమి. అతను వీధిగుమ్మపుతలుపు లోనుండి గోడదుమికి యీవలకు వచ్చెను.

మొద—అద్దెబండియేనా?

రెండ—అద్దెబండియే, కాక మరేమియున్నది!

మొద—తరువాత—

రెండ—తరువాత మేమావీధిమలుపున వచ్చుచుండ,

మొద—బండి యెక్కడిది.

రెండ—ఒకనివద్ద మైదువందల రూపాయలు తాకట్టుంచి యాబండిని తీసుకొని వచ్చితిమి.

మొద—ఎవ్వరు నడపిరి?

రెండ—రహీం తోలుకొని వచ్చెను.

మొద—ఆమలుపులో నేమైనది?

రెండ—ఆమలుపున దిరుగగానె రక్షకభటులు పోకడీల వేసిరి. మాకు భయముపొడచూపినది. ఐన నంతకుముందే మేమొక యుక్తిచేసినాము. ఒక యుప్పరపిల్లవానికి స్త్రీ వేషము వేసినాము.

మొద—ఆతని కెన్నివత్సరంబులుండును?

రెండ—పదివత్సరంబు లుండును.

మొద—ఆత డెట్లు కనుబడెను?

రెండ—తెల్లటిపనుపద్దె ముసుగు యిడుగుకొనుచుండ మేమతని మావెంట దీసుకివచ్చితిమి. తరువాత రక్షక

భటుడు నాబండివద్దకు వచ్చి యెక్కడకు బోవుచున్నది. బండి యనియడిగెను. నేను బరోడా మెయిలునకని జవాబు చెప్పితిని. ఆతడును సమ్ములలెక్క సేయుచు వెడలిపోయెను. తరువాత నాబండిని కరలాక్ బజారునకు తీసుకవచ్చి యక్కడనున్న చలనహేతుకశకటంబులో నీమెనుంచి యాయుష్కరవానికై పురూకలిచ్చి యాబండి యాతనినిపైలుప్టేషనువద్ద మనుజున కివ్వమని చెప్పి వెడలిగారము. తీసుకవచ్చి మన రెండవభాగ్యహంబులో బడవైచినారము.

మొద—రహీమిప్పుడేడీ?

రెండ—ఆతడు మరల బొంబాయికి వెళ్ళి యైదువందలరూప్యములు తెచ్చినాడు. ఇప్పుడు భాగ్యహమువద్ద నెవ్వనినో బట్టినాడు. ఆతనిని గూడ భాగ్యహములో బడవైచి వచ్చును.

మొద—ఆబాలు డెవ్వడు?

రెండ—పిల్లవాడు కాదు. సుమా రిరువదివత్సరంబులుండును.

ఇంతలో రహీమక్కడకు వచ్చెను రమాకాంతుడతి జాగ్రతగ గూర్చుండెను. ఉచ్ఛ్వాస నిశ్వాసము లంతతీవ్రముగ గాక కొంచెము శాంతించి జేయుచుండెను.

రెండ—రహీం! ఏమైనది?

రహీం—ఏమున్నది పట్టి బంధించితిని.

మొద—ఎవ్వరు?

రహీం—ఎవ్వరో బాలకుడు. ఇరువది వత్సరంబు లుండును. ఆతడు భాగ్యగృహమునద్ద గూర్చుండెను. నేను వెళ్ళి యెవ్వరని యడుగ తోటమాలిననెను. కరదీపికను వెలిగించి చూచితిని. తోటమాలికాడు. వెంటనే యాతడు నాపైకి వచ్చెను. ఆతనిమీద మనరావుగారి మచ్చు చల్లితిని. వెంటనే యాతని బంధించి మూడవగృహములో బెట్టివచ్చితిని.

మొద—రాజారావూ! తోటమాలి లేచిపోయినాడా యేమి?

రెండ—లేచిపోయినాడు.

మొద—ఆతడే యీపిల్లవాడువలె నున్నాడు. దొంగ.

రహీం—చూడ నట్లేయున్నది.

మొద—నీవు వెళ్ళి యీపిల్లవానిని యీదినముననే రెండవ గృహములో బడవైచిన బాగుండును. రేపు చంపుదము రమాకాంతుని జాగ్రతగ బట్టవలయు.

రహీం—రత్నలాలుహత్య యంతపని గావించినది!

మొద—వలపులరాణిని బట్టుట యెప్పుడు?

రహీం—దానిని వదలివైతము.

రెండ—(పరిహాసముగ) అంతే యనుకొనుము.

రహీం—నేను వెళ్ళుచున్నాను. మీరా రెండవ గృహములో గూర్చుండుడు. నేనొక యరగంటలోనే తిరిగి

రాగలను. నేను చెప్పిన కాలమునకు నేను రాకున్న నేదియో యుపాయము వాటిల్లిన దనియే తలంచుము.

అని యాత్రకు వెడలెను. వారొక త్రోవబోయిరి. రమాకాంతుడు రహీంను వెంబడించుచుండెను.

౧౦

రమాకాంతుడు రహీంను నత్యంత జాగరూకుడై వెంబడించెను. ఆత డీవిధముగ దలపోసెను.

'ఆహా! హంతకు లెంత సాహసులు! గౌరీశంకరుని యన్నపూర్ణమ్మను గూడ వీరు తప్పక బంధించిరి. ఆతడు తన యత్తను తీసుకబోయిరను విషయము నాకు జెప్పుటకు వచ్చియుండును. ఆతని బట్టి బంధించియుండును. ఈపాపిని జీల్చి గద్దలకు కండ లెగుర వేసినను పాపములేదు. వీనికాలము సమీపించినది గనుకనే వీని కిట్టి దుర్బుద్ధిపుట్టినది. మున్ముందుగా నేను వారి ననుసరింతునా అనుసరించిన మంచిదియే. గౌరీశంకరుని బంధించి యాస్త్రీమూర్తివద్దకు దీసుకొని వత్తురుకదా. అక్కడనే వీరల నందర మట్టుపెట్టెద. అప్పుడు నాకార్య మీదినంబుననే పరిపూర్తి కాగలదు. (ఆలోచించి) కాదు కాదు. నేనిప్పట్టున నాబుద్ధిని తీవ్రముగా నుపయోగించవలయును లేదేని గొప్పముప్పు తప్పక గప్పుకొనును. ముందుగా రహీం గౌరీశంకరుని దీసుకొని యాస్త్రీమూర్తి

వద్దను జేర్చునుకదా. ఈతని నీమార్గమధ్యంబుననే పడగొట్ట వలయు. అప్పటికైన గౌరీశంకరుడు నాకుచాలసహాయ భూతుడుగా నుండును. అట్లు గౌరీశంకరునిగూడ దీసికొని యీ దుర్మార్గుడు వారల జేర్చిన పని కష్టమగును. అప్పుడు నే నెన్నియో యిడుములబడవలయును" అని యాతడు దీర్ఘముగ నాలోచించి రహీమును వెంబడించెను. అచిరకాలంబులోనె వారొక యుద్యానము చేరిరి. రమాకాంతు డనుసరించుటలో నేమియు దడవుచేయుట లేదు. మధ్య మధ్య పక్షుల వినోదకూజితంబులు వినినంతనె—వాయుప్రసారమున నల్లలాడుచు గలుగు వింతధ్వని వినినంతనె—రహీమనుమానముతో వెనుకకు దిరిగి చూచుచు పోవుచుండెను. ఆయుద్యానవనములో నొకయెత్తైనప్రాకార మొండు లోచన గోచరంబయ్యెను. రహీ మాప్రాకారముచుట్టును దిరిగి యచ్చటనున్న యినుప తలుపులచే నిర్మింపబడిన ద్వారమున లోనకువెళ్ళి కవాటము బంధించెను. దాని కాద్వారముతక్క వేరొండు మార్గము లేదు. దాని ప్రాకారము నెక్కి వెళ్ళుదమనుకొనిన నది మహోన్నతమై యాతనిశక్తిని నిర్గమించెను. తలుపులు బ్రద్దలగునట్లు విరుగగొట్టుదమా యనుకొనిన యవి యయోనిర్మితములై కఠినతరముగ గానుపించెను. రమాకాంతున కాలోచనయే పొడముటలేదు. ఆతడు హృద్వేగముతో నద్దిశల బరీక్షించెను. అదృష్టవశమున నాతనిదృష్టియొక స్థలముపై

నప్రయత్నముగ బడెను. ఆతడు కౌతుక మతిశయిల్ల యొక్క నిట్టూర్పు నిగిడించెను. హృదయాంతరాళమున నాసందసౌ రభ్య మంకురించినది. అది ప్రగాఢముగ నాటుకొనిపోయెను. ఆతడు చూచినది యొక మురుగుకాలువ. దానిలో దుర్గంధ పూరిత జలము నిరాత్మముగ ప్రవహించుచుండెను. ఆతడు దానిలో బ్రవేశించుటకు వీలగునో కాదో యనుకొని యందు లో బ్రవేశించెను. ప్రపంచములో ప్రతిమానవుడును తనకు శక్తియున్నంతవరకు లోపములేక పనిచేసిన నట్టికార్యమున దైవము తనంతదానె యాతనికి సహాయభూతుడగును. రమాకాంతుడు రత్నలాలు హత్యలో నత్యంతజాగరూకుడై శ్రద్ధాళుడై, కాయకష్టంబులకోర్చి తుదకు తన భార్యను గూడ బోగొట్టుకొని కార్యసాఫల్యముకొరకుపనిచేయుచుండెను అట్టితటి దేవుడాతనికి ప్రతివిషయమందునను సాయమొనర్చు చునే యుండెను. ఆతూములో నాతడు సరిగాపోవుటకు వీలైనది. అద్దాని నెప్పుడును జలంబుచే పరిశుద్ధమొనర్చురు గాబోలు అంతయు శుభ్రపరచియుండెను. రెండు మూడు మార్లు రమాకాంతుడు జారిపడెనుగాని యత్యంత కష్టమున లోనకు జొచ్చెను. అంతయు నిశ్శబ్దము. కాని శరచ్చంద్ర చంద్రకిరణ జాలంబు లింకను నాప్రదేశమున బ్రతిఫలించు చునే యుండెను. ఆతనికి భయాశ్చర్యము లొక్కుమ్మడి యుద్భవించినవి. ప్రాకారాంతర్భాగమున నొక యుపవనము

గలదు. అందు కర్కశకంటకావృత గుల్మజాలంబులు—శిలామయమనోవ్యథాకరములైన మార్గములు—నికుంజపుంజములు—ఆ యాకులసందులనుండి నిర్మలశీతచంద్రికావళులు మణులవలె ప్రకాశించుచుండెను. రమాకాంతున కేమియు దోచకుండెను. ఆతని కక్కడ గృహ మెయ్యదియు గన్పడలేదు. రహీ మెందుబోయెనో యాతడు గ్రహింపజాలకపోయెను. ఆత డీవిధముగ దలంచెను. "రహీం లతాగుల్మముల చాటున దాగియుండెనేమో—దాగియుండుట కేమి కారణము? ఆతడు నన్ను జూడనే లేదు. ఆతడు చూచుటకు నవకాశ మెయ్యది! ఆతడు వెళ్ళిన చాలకాలమునకుకదా నేను లోనకు వచ్చితిని. నేను తూముదాటుచున్నపు డేమైన జూచెనేమో" యని పరిపరి విధంబుల దలపోసి యా వనమంతయు గలయదిరుగ జొచ్చెను. కాని యెవ్విధమైన చిహ్నములు గానుపించుటలేదు. ఆతని యాశాలత తెగిపోయినది. ఆతడు దిరుగుచున్నపు డొకబండపై నడచెను. ఆతడు కాలిడినంతమాత్రమున నాతని కెదురుగ నొక గవాక్షద్వారము దెరువబడెను. ఆతని కీహాశ్చర్యరహస్యమంతయు నగాధమై యప్రతిమమై పోవుచుండెను. వెంటనే యాత డాబండపై మరియొక పెద్దశిలనుంచి యా గవాక్షము దగ్గరకు వెళ్ళి తొంగి జూచెను. లోననంతయు విషవాయుసంకీర్ణము—అంధకారము—ఆతని కేదో వినంబడుచుండెను. చెవియొగ్గి వినెను. ఒక స్త్రీకంఠము—భయాతుర నారీకంఠము—సహాయాపేక్షగల

యువతీకంఠము—దుఃఖాతుర రుద్ధకంఠము వినంబడెను. ఆమె విలపించుచు మెల్లగా నేదియో మూల్గుచుండెను. రమాకాంతుడు లోనకుబోవ మార్గము గానరాకుండెను. ఆతని హృద్వేగము వాయువేగమును నిర్గమించెను. ఆతడు దాను వచ్చునపు డయోనిర్మితంబులైన వస్తువులను సునాయాసముగ విడదీయుటకుగాని లేక వాటి బ్రద్దలు జేయుటకుగాని బనికి వచ్చు ఒకవిధమైన మందును దీసుకొనివచ్చెను. అది యిప్పు డాతనికి యుపయోగించినది. వెంటనే యాత డాయినుప చువ్వలను నామందు సాహాయ్యమున నిశ్శబ్దమునకు భంగము గలుగకుండ దీసి లోనకుదూరి దూకెను. ఆత డట్లు దుముకు నపుడు గ్రిందబడిపోయెను. ఆతనికి తిరుగ వినంబడెను. అదియే తాను గవాక్షమునుండి వినిన నారీకంఠము. రమాకాంతుడు దాననుకొనిన రీతిగనే వచ్చితినని దలంచెను. వెంటనే దన కరదీపికను వెలిగించి యాస్త్రీమూర్తి దిక్కుకై జూచెను. ఆమె యొక నూతన స్త్రీమూర్తియే—అపరిచితురాలే! రమాకాంతు డామె దన భార్య కాదని దలంచెను. ఆస్త్రీమూర్తి త్రాళ్ళచే బంధింపబడియుండెను. చాల శుష్కించి పోయెను. సంస్కరణ హీనంబులగు నినీలకుటిల కుంతల దామము గుచ్ఛగుచ్ఛములై వెన్నున వెదజల్లుకొనియుండెను. ఆమె యింకను జీవితమై యున్నదని యాతడు దృఢనిశ్చయు డయ్యెను. వెంటనే తనకత్తితో నామె త్రాళ్ళను విదల్చెను.

వెంటనే యామె దన ముకుళేందీవరసదృశంబులగు నయనం బుల నర్ధస్ఫుటముగ దెరచెను. ఆతడు దన్ను బాధించుటకు వచ్చిన పాపుడనుకొని యామె అట్లు గను లనర్ధస్ఫుటముగ దెరచినదేమో యనుకొని ...మెను "అమ్మా" యని బిలచెను. ప్రత్యుత్తరము లేదు. రమాకాంతుడు మరల బిల చెను. ఇప్పుడామె దనకనుల స్ఫుటముగ దెరచి మందహాస చిహ్నముల జూపెను.

రమా—అమ్మా! నీకు నేను సాయమొనరుపవచ్చిన పత్తేదారుడనుగాని హింసించుటకు వచ్చిన పరమనీచుడను గాను.

ఆమె మాటాడజాలకపోయెను. కాని యామె దాహ మని తన హస్తముతో సంజ్ఞ జేసెను. వెంటనే రమాకాం తుడు తన తోలుసంచి లోనుండి జలంబుతీసికొని యామె కిచ్చెను. ఆమె జలంబు ద్రావగనే తనదగ్గరనున్న లడ్డులను కొన్ని యిచ్చెను. కొంతవడికి రమాకాంతుని యుపచారము వలన నామె కొంతసేద దేరెను. ఆమె యస్ఫుటవచనంబుల గొన్ని బల్కెను.

స్త్రీమూర్తి—అయ్యా—మీ—పేరేమి?

రమా—నాపేరు రమాకాంతుడు. నానివాసము బొంబాయినగరము. పత్తేదారుడను.

స్త్రీ—అయ్యో—ఇక్కడ కెందుకొచ్చినారు—ఉశ్- దుర్మార్గులనివాసము—ఇప్పుడే—ఆ—పాపిష్టివాడు—వచ్చి —

నన్ను ఏడిపించి వెడలినాడు—హామాంటలాంటకించి—ఉశ్—వెళ్ళి—పోండి—

రమా—నాకేమి భయములేదు. వాని నీదివములోనె యంతమొందించి నిన్ను విడిపింపగలను. రమాకాంతు డప్పుడు వచ్చి యామెను బాధించినది రహీమనితలంచెను. అన్నపానీయములు లేక యామెచాల శుష్కించినదని యాతనికి దోచెను. ఆమె హంతకుల బారి జిల్లబడినదో గగ్గినవలె ననియాశ యాతనికి బొడమెను కాని యది సమయముగాదని తలంచెను.

రమా—నీ పేరేమి?

స్త్రీ—నాపేరు అలివేణి.

రమా—నీకులమేమి?

స్త్రీ—కళావంతులము.

రమా—నీ దేయూరు?

స్త్రీ—నాది—

ఇంతలో గ్రిందనశనిపాతమువలె పెద్దచప్పుడయ్యెను. అకస్మాత్తుగ రమాకాంతుడు నిలుచుండినస్థలమున కనతి దూరమున భూమి బ్రద్దలై యందొక సొరంగమేర్పడెను రమాకాంతు డాశ్చర్యచకితుడై పోయెను. నిర్విణ్ణుడై చేయున దేమియు దెలియకుండెను. విషమసంకటమున బడిపోయెను. ఆతడు దానువచ్చినదే యొక పాతాళగృహమనితలంచ నాతని కంటికి నధోభాగమున మరియొకపాతాళగృహ మున్నదని

తెలియగనే యాత డాపాదమస్తకమును చలించిపోయెను. వెంటనే ఆతడా సౌరంగపుటుత్తరభాగంబున నిలువంబడి తొంగిజూచెను. అందు దారు నిర్మితసోపానపంక్తులు! అవి యుత్తరమునుండి దక్షిణమునకుం డెను. ఆతడు దాను సరియైన స్థలమునందే నిలువంబడితినని తలంచి తనకరదీపిక నార్పివైచి కొని కదలక మెదలక నిశ్చలుడై నిలువంబడియుండెను. ఒక మనుజు డొక నవయావనుని భుజంబునవైచికొని యాసోపాన ముల నధిరోహించి వచ్చుచుండెను. రమాకాంతుడా వచ్చి నది రహీమనియు నారెండవవ్యక్తి గౌరీశంకరుడనియు వారు వద్ద సంభాషణవినుటవలన గ్రహింపజాలెను. ఆ ముందువచ్చు వ్యక్తి చేతిలో కిరసినుదీపముండుటవలన వార లను రమాకాంతుడు విశదముగ గుర్తించెను. అచిరకాలంబు లోనె రహీం సోపానము లన్నిటినిదాటి దక్షిణాభిముఖుడై యక్కడనున్న మీటనొక్కెను. ద్వారమొకటి దెరువం బడెను. రహీమంతటనాద్వారమున బోవుచుండెను. రమా కాంతుడు పదధ్వనియగునట్లుగాక యతినెమ్మదిగ నాతని ననుసరించెను. ఆముందుబోవు రహీ మాతని భుజంబుపై నున్న త్రాళ్ళచే బంధితుడైన నవయావనుని యెత్తి నేల బారవైచెను. అనవయావనునకు జెలివిలేదని రమాకాం తుడు గ్రహించెను. వెంటనే రహీ మొక్క నిట్టూర్పు నిగి డించెను. రమాకాంతుడాలసింపక నాతని నొక్కపెట్టున దన భుజంబులలోన గట్టిగ బిగబట్టి నొక్కివేసెను. దీప మప్లే శాంతించిపోయెను, రహీం చాలసేపు పెనగు లాడెను.

వారిద్దరు ముష్టాముష్టి బాహాబాహీగ శ్రీకృష్ణ జాంబ వంతులరీతి బోరాడిరి. రమాకాంతు డసమానబలతేజశ్శాలి, ఆత డొక్కమ్మడి దన బలంబునంతయు గూర్చి రహీమును క్రిందబడద్రోసెను వెంటనే యాతనిగుండెలపై నెక్కి యా తని ముఖంబుమీదను మొడలంతయు గట్టిగ జావమోదెను. రహీం క్రిందబడి కాళ్ళు కిలకిల కొట్టుకొనెను. వెంటనే యాతని వాయుద్యానములో విసరి పారవైచెను. శీఘ్రంబుగ గౌరీశంకరుని కట్లువిప్పి యాతనికి మిఠాయి యిచ్చి దాహం బునకు జలంబు నిచ్చెను. గౌరీశంకరుడు విస్మయచేతస్కు డయ్యెను.

గౌరీ—మామా! ఎట్లు వచ్చితిరి ?

రమా—ఈ ప్రాకారము దాటి యా తూముగుండ వచ్చితిని. ఇంక నేమైన గావలయునా ?

గౌరీ—ఇంకేమియు నక్కఱలేదు.

రమా—ఎట్లు యిక్కడ బడియుంటివి ?

గౌరీ—నేను రాత్రి యెనిమిదిగంటలకు సుమారిక్కడ బడియుంటిని. అత్తను ఎవరో యెత్తుకుపోయినారను విష యము తమకు దెల్పుటకు నే నిక్కడకు రా నన్నుబట్టి బంధిం చిరి. నేను యింటికి వెళ్ళునప్పటికే యామెనుబంధించి తీసుక పోయిరి. కావలికాచు లక్ష్మిని జావగొట్టి పెరటిలో నుండి తీసుకపోయిరి.

అంత వారిద్దరు కొంతసేపు విషాదచేతస్కులైరి.

అంత గౌరీశంకరుడును రమాకాంతుడును గలసి యాత్రీ మూర్తి వద్దకు లోనకుజనిరి.

రమా—గౌరీ! ఈ త్రీమూర్తిని యెఱుగుదువా?

గౌరీ— తెలియదు.

రమా—ఈమె యలివేణియట — కళావంతులట. ఈమెవలన మనము హత్యారహస్యము లనేకములైనవి తెలిసికొనగలము. కాన యీమెను నీవుతోడ్కొని యచ్చట నేను వచ్చువరకు నీమెను భద్రముగ గాపాడుచు విశ్రాంతి నొందుము. నేను బహుశా రేపు మధ్యాహ్నమునకు రా గలను. నేను రానిదే యెవ్విధమైన ప్రశ్నల వేయకుము. తరువాత మీయత్తను గురించి మన మిద్దరమును గలసి వెదకుదము. అత్తను దీసుకపోయినవారే హంతకులుసుమా!

గౌరీశంకరు డాతని వచనంబుల కియ్యకొని యలివేణిని భుజంబున వేసికొని ప్రాకారద్వారము దెరచికొని వెళ్ళి పోయెను. అప్పుడు రెండుగంటలైనది. రమాకాంతుడు ప్రాకారద్వారము మరల మూసివైచి లోనకు జనెను.

౧౧

రమాకాంతుడు గౌరీశంకరునిబంపి యూతనిని రహీం దోడ్కొనివచ్చిన సొరంగమును బరీక్షించవలెనని లోనకు వెడలెను. వెంటనే యాతడా సొరంగమును బ్రవేశించి కరదీపికను బాగుగా వెలిగించి సోపానములనుండి క్రిందికి

దిగి పోవుచుండెను. అంధకార సమాక్రాంతమై యుండెను. ఆతడొక్కొక్క సోపానమును క్రిందికి దిగుచున్న కొలది నాతనికి దుర్వాసన మీదుమిక్కిలిగ నాసికకు దట్టెను. అంతయు దుర్వాసన — దుర్గంధపూరిత విషవాయు సమాక్రాంతము— మృత్యుగహ్వరము — యమదూతల కాలవాలము—భూతగృహము — పైశాచికముల రంగస్థలము— వలె నాతనికి ప్రతిక్షణమందును దోచుచుండెను. ఆతడు తన నాసికను త్తరీయంబుచే గట్టిగ బిగియబట్టుకొని సోపానముల నన్నిటి నవతరంచి క్రిందికిదిగెను. అత్యాశ్చర్యకరముగ నాదారునిర్మిత సోపానపంక్తు లదృశ్యంబులైపోయెను. అంతయు సంభ్రమము—చిత్తవ్యాకలనము — మనశ్చాంచల్యము— బుద్ధిమాంద్యత — రమాకాంతుడొక్కసారి చకితుడై పోయెను. నిలుచున్నచో స్తంభీభూతుడై పోయెను. అక్కడ నేదో నొకమీట యుండుటవలన నాసోపానపంక్తు లదృశంబులైనవే గాని మరేమియు గాదని తలంచెను. ఆతడు తిరిగిపోవుటకు దగినమార్గము గానరాకుండెను. ఎన్నండు నెరుగని రమాకాంతునకు దుఃఖము సముద్రపుపొంగువలె పొరలిపొరలి వచ్చుచుండెను తన జీవితమంతయు దుఃఖము తన జీవితమంతయు దుఃఖభాజనమై పోయినదని యేడ్చెను. కొంతవడికి ధైర్యము దెచ్చుకొని నల్దిశల జూచెను. దారుణ భీషణకాలకాకోదర దంష్ట్రానలజ్వాలాకీలల, భయాతురమూర్తి వీక్షణాశక్తి మూషికమైపోయెను. ఆగది యంత విశాల

మైనది కాదు. అంతయు వల్మీకసమావృతము. సర్పముల కూతలు వినబడుచున్న ట్లాతనికి దోచెను. రమాకాంతుని భయము, చదువరీ! ఇక వర్ణింపజాల. అట్టి భూతంబుల కాల వాలంబైన పాతాళగృహమున—అర్థరాత్రసమయంబున— వల్మీకముల నడుమ—కంటక శిలామధ్యంబున—ఒంటిగ— నీవుండిన నీకు వొడము భయమునకు రెండింతలు కానున్నదని యూహించుకొనుము. అట్టి సమయంబున నాతనిలోచనంబుల కేదియో గోచరంబయ్యెను. విస్మయచేతస్కుడై యాతడు గాంచిన స్థలముదగ్గరకు బోయెను. అది యొక దారునిర్మిత మైన యలమారు! దానిని దెరువ ప్రయత్నించెను. ఆయల మారువద్ద దుర్గంధము మరింత యెక్కుడయ్యెను. అదిబీగము వైవబడి యుండెను. దానిదాళపుచెవి యచ్చట నెక్కడైన దొరకునేమో యని యన్నిదిక్కుల వెదకెను ఒక గూటిలో నదృష్టవశమున నొక తాళపుజెవి యుండెను. దానిని దీసికొని యలమారుబీగమునకు బెట్టి చూచెను. సరిపోవ శీఘ్రుంబుగ నాయలమారును దెరచెను. ఆతడు వెంటనే వెనుకకు తూలి పడిపోయెను. భయభ్రాంతుడై పోయెను. చిత్తవ్యాకలన మొందెను. అదికలయో కల్లయో గూడనాతడుగ్రహింపజాలక పోయెను. పిశాచమేదైన నావహించినదేమో యని భీతి వొడమెను అందు పరిచితమగు నొకపురుషమృతదేహము!!!

ఆశరీర మెవ్వానిదో నాతనికి దోపకుండెను. తన కరదీపి కను మరింత పెద్దదిగ జేసి చూచెను. ఆ చనిపోయిన మను

జుడు చాల శుష్కించియే మరణమును బొందెను. ఆతడు వాస్తవముగ చనిపోయినాడో లేక జీవించియున్నాడో కూడ నాత డూహింపజాలకపోయెను. తనవ్రేలు నాతని నాసికవద్ద నుంచి శ్వాస జరుగుచున్నదేమో యని చూచెనుగాని యా తనియూహ సరిపోలేదు. ఆతడు నిక్కముగ చనియే పోయి నాడు. ఆతని దుస్తులు నూతనముగ నుండెను. ఆతడు గొప్ప ధనవంతుడని రమాకాంతుడు వెంటనే తలంచెను. ఆత డలమారులో రెండవయర దెరచెను. ఆత డీసారి మరింత భయవిహ్వలుడై పోయెను. నిశ్చలుడై పోయెను. నిర్విణ్ణుడై పోయెను. నిలువెల్ల స్తంభితుడై పోయెను. అప్పుడాతడది భూతగృహమని నిక్కువముగ దలంచెను. అందొక యపరి చితమగు స్త్రీశవము!!! ఆతడు హృద్వేగముతో నామెను బరీక్షించెను. హత్యారహస్యమంతయు నాతనికి యగాధమై యప్రతిమమై గాఢమైపోయెను. నిదర్శనానొక హత్యాసం ద్రంబునందు గట్టు వదలి పోయెను. ఆమె మణిమయభూష ణము లింకను తేజోవంతములై యుండెను. ఆ యిద్దరు భార్యాభర్తలని యాతడు తలంచెను. శీఘ్రంబుగ నాతడు పురుషమృతదేహముయొక్క దుస్తుల దడవి చూచెను. విషాదసూచకముఖ మనుగగనతలంబున చంద్రికలను నానం దసూచకము లంకురించెను. అవి ప్రశాంతమై నిల్చెను. ఆతని కొకలేఖదొరకినది. చివరయస్ఫుటవచనములు; సంత

కము గూడ నస్ఫుటముగ నుండెను. తన కరదీపికావెలుంగున దాని నీవిధంబుగ జదువుకొనెను.

దయార్ద్రహృదయులారా!

నా దుఃఖభాజనమైన జీవితచరిత్రను సంగ్రహముగ వ్రాయుచున్నాను:—

నాజన్మస్థానము బొంబాయినగరము. నాపేరు వినయభూషణుడు. నాకు చిన్నతనంబుననే మాతాపితరులు కఱవయ్యిరి. నాపినతండ్రి నన్నెంతయో గారాబమున బెంచుచుండెడివాడు. ఆతడు మిగుల ధనవంతుడు. అచిరకాలంబుననే నేను వాణిజ్యవిషయమున జాలవిషయంబులు నేర్చుకొంటిని. నాపితృవ్యుడు నన్నొకబ్యాంకిలో ప్రవేశపెట్టెను. ఆబ్యాంకిందారుడు నాపైమిగులనమ్మకము గలవాడైనాకు మంచి వేతన మొసంగెను. నాకు ప్రేమాస్పదుడుగ నుండెడివాడు. ఆతనికొక తనయకలదు. వాత్సల్యముచే నాతడు గొంత కాలమునకు నామెను నాకిచ్చి పరిణయముచేసెను. ధనము వరశుల్కంబుక్రింద రెండులక్షలనిచ్చెను. నాపినతండ్రి యెంతయో సంతసించెను. కొంతకాలంబునకు నాకొక తనయుడుద్భవించినాడు. కతిపయమాసంబులకు నాపితృవ్యుడు కారణాంతరములచే గొందరుదుర్మార్గులకు వశుడై వారియిచ్చవచ్చిన చొప్పున బ్రవర్తింపనొడంగెను. అప్పటినుండియు నాతని యాస్తిపాలభాగము దఱుగజొచ్చినది. నేనస్థానికగ్గొ

నజాలక నాపితృవ్యులకు వారలేదో సహాయముచేయుచుండి రని తలంచి నేనుకూడ వారలతో స్నేహము జేసితి, నేనుగూడ నాపినతండ్రివలె వారలకువశుడనైతి. ఒకనాటి రాత్రికాలమున వారు నన్నెచ్చటికో మోటారుమీద తీసుకపోయిరి, త్రోవలో నాకు నీలాంబరముల గట్టనిచ్చిరి. వార లెందుకట్లు గావించుచున్నారో నాకనుమానముదయించి వారలనడిగితిని. వారునాకు చెప్పలేదు. నేను వారికి లొంగియుండుటవలన వారిని వీడజాలక పోయితి. వారు సన్యానందకుటీరమువద్దకు దీసుకపోయిరి. అప్పుడే మాకొక మోటారెదురైనది. అందులో యౌవనులగు యువతీ యువకులు కూర్చుండిరి. వెంటనే మావారిలో నొకడు తనతుపాకి బ్రేల్చియా పురుషుని జంపి పారవైచెను. ఇంతలో మరియొక మోటా రెదురగుట వలన మేము పారిపోయి మరల నారాత్రియే వారలహింసించితిమి. వారా స్త్రీరత్నమును గ్రహించుటకేగాబోలు నట్లుకావించి రని తలంచితిని. అప్పటినుండి నాకు వారిపై నయిష్టమంకురించినది. నాపితృవ్యునితో వారలస్నేహము మానుమనియు, వారలు దుర్మార్గులనియు జెప్పితిని. ఒకనాడతడు వారలదూషించినాడు. వారలు కక్షబూని యాతనిని జంపివైచిరి. నాపినతండ్రిని చంపినదాదిగ వారలపై కోపోద్దీపితమానసుండనై వారితోడిసఖ్యమువదలితి. వారు నన్నవమానించిరి. ఒకదినంబున వారలను నాతోడ స్నేహముమానుడని యుక్తి

తీవ్రముగాబల్కితి. ఈహత్యారహస్యమంతయు బత్తేదారుడగు రమాకాంతునకు జెప్పివైచెదనని బెదరించితిని. ఒకనాడు నేను నాభార్యతో విద్యుద్దీప ప్రదర్శనముజూచి వచ్చుచుండ వారు మాపైబడి మమ్ముల బెదరించియిందు దాచియుంచిరి. హంతకులేడుగురున్నారు. ఆయేడవవాడెప్పుడును రాత్రి కాలమందే నీలాంబరముల గప్పుకొనివచ్చును. వానిని నేను గుర్తించలేకపోయితిని. వారందరు హంతకులు దుర్మార్గులు రత్నలాలుహత్య కావించినది యీదురాత్ములేఅందులో విశ్వాసరావును, రామరాజును, రహీమును, రాజారావును, నూతననీలాంబరాచ్ఛాదిత పురుషుడును యింకను మరియొక సేవకుడును నుండిరి. మిగిలినవాడు కేవలము హంతకుడు కాడుగాని వాడుహంతకుల ప్రోత్సాహకుడు. వాడును వీరి బృందములో జేరినవాడే. అతడుపాలతను నగరరాజగు శ్రీశ్యామసుందరుడు! ఎవ్వరైన మహాత్ములు మమ్ముల విడపింపవచ్చినపుడు యిడుములబడకుండ యీదారునిర్మితమైన నలమూరున కడుగుననున్న. నాపరాతినెత్తి యుంచుండు సొరంగముగుండ తమదారి జూచుకోదగు. ఈరహస్యము నాయంత్య కాలంబున గనుగొంటిని. నేను తప్పించుకొని పారిపోవుట కశక్తుడనైతిని. ఈదురాత్ములను నృశంసులను అంతమొందించుడని ప్రార్థిచుచున్నాను— వినయ

రమాకాంతుడు వెంటనే యాబీరువాయడుగుభాగము జూచెను. అందు నాపరాయియుండెను. కాని యదిమిగుల

బరుకైనది. ఆకస్మాత్తుగ జప్పుడై యాదారునిర్మితసోపాన పంక్తులు యథాస్థానమునకు జేరెను. రమాకాంతునకు దత్తర పాటుద్భవించెను. వెంటనే యాశవమును నలమారునం దుంచి యానాపరాతిని బలముగ నెత్తి యాసొరంగముగుండ నదృశ్యుడై పోయెను. ఆవచ్చునదియెవ్వరు? రహీం గంట వరకును గూడ రామింజేసి యొకహంతకు డాతనిజాడల గను కొనుటకు రహీం దుస్థితిగాంచి లోన పత్తేదారుడున్నాడని తెలసికొని యాతనితో పాతాళగృహంబునకు పత్తేదారుని వెదకుటకు వచ్చుచుండెను. కాని రమాకాంతుడు గుప్త మార్గంబున వెడలిపోయెను.

౧౨

రమాంకాంతుని గృహంబున బడకగదిలోన గౌరీశం కరుడును, అలివేణియు, రమాకాంతుడును, గూర్చుండి మాట్లాడుచుండిరి.

రమా—అలివేణి! ప్రథమమున నీ దేయూరు? వృత్తి యెయ్యది?

అలి—పత్తేదారుగారూ! మొదట నాది పునహాపట్ట ణము నాతలిదండ్రులు చిన్నతనమునందే గతించిరి. అప్పుడు నేనొక సంపన్నవర్తకుని యాశ్రయమందుంటిని. నాకు సంగీత విద్యయందును, వర్తకమునందును ససమానప్రవేశముగలదు

కొలదిదినంబులకు నిద్దరు కుమారు లుదయించి లోకాంతర గతులైరి. నాకొక కొమరితగలదు. దీనిపేరు వలపులరాణి.

వలపులరాణి పేరువినగనే రమాకాంతు డాశ్చర్య చకితుడై పోయెను. ఆత డిట్లని యనుకొనెను. "ఏమీవలపుల రాణియా! మోహన్ లాలువద్దనున్న వలపులరాణి కాదుగదా అలివేణితనయయా!"

రమా—అలివేణీ! వలపులరాణి నీకూతురా యేమి? నిజమేనా? ఆశ్చర్యముగనున్నది.

అలి—ఏమీ యిట్లడుగుచున్నారు? వలపులరాణిని యెక్కడైన జూచితిరా యేమి? చెప్పుడు.

రమా—తరువాత విశదముచేసెదను. నీవృత్తాంత ము కానిమ్ము.

అలి—నేనును నావలపులరాణియు గలసి సంగీత సభల జేయుచు దేశాటనము జేయుచుండెడివారము.

రమా—అప్పుడు వలపులరాణికి యెన్నివత్సరము లుండును?

అలి—అప్పుడు పదునైదేండ్ల వయసుమాత్రమే.

రమా—ఆమె నెవ్వరియాశ్రయమం దుంచలేదా?

అలి—చెప్పుచుంటినికదా—వలపులరాణియు నేనును నొక దినంబున పాలతనునగరరాజగు శ్యామసుందరునివద్ద సంగీతసభ గావించితిమి.

రమా—శ్యామసుందరుడా! అంతయు సంభ్రమముగా నున్నదే?

అలి—ఆసభాంతము మేము గొప్ప బహుమతులు వడసితిమి, గొప్పబహుమాన మేమన, నారతనాలమూట—మణులదండ, మోహంపులతిక—ముద్దులగుమ్మ—లావణ్య రాశి—బంగారుబొమ్మ—శృంగార దేవత— వలపులరాణిని నాతడు తనయాశ్రయమందుంచుకొనినాడు. కతిపయమాసం బులకు మేము కృష్ణజయంత్యుత్సవ సందర్భమున ద్వారకా నగరంబునకు వెళ్ళితిమి. ఆవెళ్ళునపుడే వినయభూషణుని గృహమందు రత్నాబాయి పాటకచేరి దర్శించి వెడలి పోయితిమి.

రమాకాంతు డదరిపడి వెనుకకు దూలిపడిపోయెను. ఆతని కీహత్యారహస్యమంతయు దెల్లమగుచుండెను. అనేక విషయంబుల మనంబు జొన్పినందున నాతనిచిత్తము వ్యాకలన మొందెను. వినయభూషణునిదేకదా యిప్పు డాత డలమారు నందు జూచినది. వెంటనే తనవద్దనున్న యుత్తరమునుదీసి చూచెను. ఆమె చెప్పువాక్యము లందులోనున్న యుదంతము నకు సరిపోయెను. అలివేణి మరల చెప్పదొడంగెను.

అలి—ద్వారకనుండి తిరుగవచ్చిన తదుపరి కతిపయ మాసంబులకు నేను గోపాలరావనునతని బెండిలియాడితిని.

రమా—నీవళ్లు లేచివచ్చుటకు కారణమేమి? అతడే మైన గోపగించుకొనెనా?—

అలి—ఆతడేమియు ననలేదు. నామోహపిశాచ మట్లుగావించినది. దానిపాశముల విదల్చుకొన జాలకపోతిని. తదుపరి నేనువిడిచిన సంగతివిని యాతడు నన్ననేక భంగుల దూషించెను. అక్షరాని కఠినోక్తుల నాలనాడెను. అది వలపు రాణి విని సహింపజాలక నాతనితో నతి తీవ్రముగా మాట్లాడి యుండును. వారల కయిష్టముదోచినదిగాబోలు. ఒకదినం బున నిశీధమున నామెయూరినుండి వెడలి యెచ్చటకోపోయిన దట. అప్పటినుండి యింతదనుక నామె యెక్కడనున్నదో నేనెఱుంగను.

రమా—గౌరీ! ఇదియంతయుచాల విశ్వాసార్హముగ నున్నది.

అలి—అయ్యో! ఆవిశ్వాసుని పేరుచెప్పిన నాకు భీతి వొడము చున్నది. ఆనృశంసుడు—

రమా—ఆత డెవ్వరు ?

అలి—ఆతడు శ్యామసుందరుని కార్యనిర్వాహకుడు. నేనున్నంతవర కాతడు చాల సత్పురుషుడు. కారణాంతరము లచే నాతడట్లు మారిపోయెను.

రమా—నిన్ను బంధించునపు డాతడున్నాడా ?

అలి—లేకేమి.

రమా—నీవెట్లు బంధింపబడితివో చెప్పుము.

అలి—ఒకనాటి సాయంకాలమున—అసలు గోపాల రావొక బట్టలవర్తకునివద్ద గుమాస్తాగా నుండెడివాడు. ఆతనికి

యెనుబదిరూప్యముల వేతనము వచ్చుచుండెడిది. ఆతనికి బిడ్డలులేరు తల్లియును నాతడే యాయింటనుండెడివాఁడు. ఒక రోజున గోపాలరావు తనయజమాని బంపించినాడని యమృత సరునకు బోయినాఁడు. అప్పుడు నేనును నాతని తల్లియు నుంటిమి.

రమా—ఆతనికి భార్యలేదా?

అలి—మొదటిభార్య గతించినది. తరువాత నన్నే పెండిలి యాడినాఁడు.

రమా—ఆతడుకూడ కళావంతులేనా?

అలి—ఔను. రాత్రి పండ్రెండున్నరకు రక్షకభటుని పారాయంతయు జరిగినతరువాత మాయింటి సింహద్వారము తెరచినట్లు చప్పుడైనది.

రమా—ముందుగా నేనొకటి ప్రశ్నించెదను. అప్పుడు మీరున్నది యెక్కడ?

అలి—జిజూరులో—

రమా—నీవివాహ మెక్కడైనది?

అలి—పాలతనునగరమందు.

రమా—కల్యాణనగరమున నీకెవరైన బంధుగు లున్నారా?

అలి—ఎవ్వరును లేరు.

రమా—మీ మేనత్తకుమారు డున్నాడట.

అలి—నాకు మేనత్తకొడు కసలేలేడు.

రమా—నిజమేనా?

అలి—దైవసాక్షిగ-నిక్కమము.

రమాకాంతున కొక్కసారి కోప ముప్పతిల్లెను. బెబ్బులినిశితలోచనతీక్షణతను బదిసారు లోడింపగలుగు రోషారుణ నిశితదృష్టుల నిగిడించెను. ఆతనికి వలపులరాణి యంతయు నసత్యము జెప్పినదని తెలిసికొనెను. వెంటనే యది కోపమునకు సమయముగాదని తలంచి తనభావమును మరల్చుకొనెను.

రమా—వృత్తాంత మతిశీఘ్రముగా పూర్తిచేయుము నాకు తొందరపని యున్నది.

అలి—అల్లు చప్పుడయిన వెంటనే నేను మేల్కాంచి మాయ త్తి యేమైన దీసిన దేమోయని చూచితిని. మాయ త్త మంచముపైననే పరుండియున్నది. నేను వెంటనే కరదీపిక దీసుకుని తలుపుదీసుకుని బయటకడుగిడగానె కరదీపిక శాంతించినది. వెంటనే యొకమనుజుడు నన్ను గట్టిగ గౌగిలించుకొని యావలకు దీసుకపోయెను, నేనరచుటకు దగినంతియవకాశమీయకుండగనే మరియొకడు నోట గుడ్డల కుక్కెను. నన్ను గౌగిలించినది యావిశ్వాసరావే! నేను బాగుగ గుర్తించితిని, నానోట గుడ్డలుకుక్కినది రాజారావు. అది యాతడనిన తరువాత నేను దెలసికొంటిని. తరువాత నన్ను బంధించి యిటకు దోడ్కొనివచ్చిరి. ఇప్పుడిట్లు బాధ పొందుచున్నాను.

తమఃగుణ—

రమా—భీతిజెందకుము. ఈయూరిలో రత్నలాలను నతని నెలదినంబులక్రింద హత్యచేసిరి. ఆవిషయము నీకేమైన దెలియునా?

అలి—నాకేమియు దెలియదుగాని యప్పుడప్పుడు నేను బంధింపబడినతరువాత నాయెదుట వారు రత్నలాలును గురించి యెద్దియో ప్రసంగించుకొనుచుండెడివారు. దానింబట్టి వారెద్దియో హత్యగావించినారని తెలిసికొంటిని.

రమా—నిక్కముగ వలపులరాణి నీకొమరితయేనా?

అలి—అబద్ధమాడవలసినంతపనియేమి? మీరేదియో విషయ మెరింగించెదనని పల్కియున్నారు. దయయుంచి చెప్పినకొంచెము మనశ్శాంతిగలుగును.

రమా—ఆమె యీయూరిలోన యున్నది.

అలి—(తత్తరపాటుతో) ఎక్కడ?

రమా—నెలదినములక్రింద రత్నలాలువద్ద నుండెడిది కాని రత్నలాలుని నెవ్వరోచంపిరి. ఆహత్యారహస్యమందున నేనును పనిచేయుచున్నాను. ఆమె యిప్పు డాతనిసోదరుడగు మోహన్ లాలువద్ద నున్నది వెళ్ళుదమా?

అంత రమాకాంతు డామెను గౌరీశంకరునితోగలసి మోహన్ లాలుమందిరమునకు వెడలెను. వారు వెళ్ళునప్పటికి మోహన్ లాలింటలేడని పాశావాని నడిగి తెలిసికొనిరి. సరాసరి వారు వలపులరాణి గదివద్దకుజని యచ్చటలివేణి

నుంచి రమాకాంత గౌరీశంకరులు కూర్చుండిరి. ఇంతలో లోననుండి వలపులరాణి వచ్చి రమాకాంతుని జూచి యెదరి పడెను. ఆమె ముఖభావముల రమాకాంతుఁడు ప్రతిక్షణ మును, బరిశీలించుచునే యుండెను. వెంటనే యామె యాతనిరాక గూర్చి యడిగెను.

రమా——కూర్చుండుము. మోహను డెక్కడకు వెళ్ళినాడు?

వల——ఇప్పుడే బజారునకు వెళ్ళినారు.

రమా——బాగుగ జూచుచున్నాడా? ఈమధ్య ఊరికి వెళ్ళినాడని వింటిని.

వల——ఆతడువచ్చి మూడుదినంబులైనది. నన్ను దన ప్రాణములతో సమానముగ జూచుకొనుచున్నాడు.

రమా——సంగతి గుప్తముగ నుంచకుము. రత్నలాలు నకు బూర్వము నీవెవరియొద్ద నుంటివి?

వల——ఇదివరకు మీరొకసారి నావద్దకువచ్చినపుడు నేనంతయు నబద్ధము చెప్పితిని. ఎందుకన నన్ను మోహన్ లాలు విడచుననియు నాకు రత్నలాలొసంగమని చెప్పిన రెండులక్షలరూప్యము లివ్వఁడనియు నేనిదివరకు శ్యామసుంద రునివద్ద నుంటినని చెప్పనేను దోషినేవిధముగానైన నగుదు నేమోయని యన భీతిచేత నబద్ధము చెప్పితిని.

అంత నాయోషామణి తన చరితమంతయు బూస గ్రుచ్చినట్లు చెప్పెను. రమాకాంతుడు సంతసించి——

రమా—ఇప్పు డెచ్చటనున్నది మీయమ్మ?

వల—దైవసాక్షిగ నే నెఱుగను.

రమా—ఒకవేళ ఆమె వచ్చిన మోహానుడామెను నీవద్ద జేర్చుకొనునా?

వల—నిస్సంశయము. ఆతఁడు చేర్చుకొనకపోయిన నా రెండు లక్షలరూప్యములు లేవా?

రమా—మీయమ్మ యిక్కడకు వచ్చినది.

ఇంతలో నలివేణి యచ్చటకు వచ్చెను. మాతాపుత్రికల సమాగమము—సంతోషభరితము—వలయునెడ మరల వచ్చెదమని రమాకాంత గౌరీశంకరులు వెడలిపోయిరి.

౧౩

రమాకాంతుడును గౌరీశంకరుడును గదిలో గూర్చుండి మాట్లాడుచుండిరి.

రమా—గౌరీ! ఇక అత్తవిషయ మేమిచేయుదము.

గౌరీ—వా రాద్వారే హంతకులు. ఇంకను సంశయమా!

రమా—పట్టుకొందుము. నిదర్శనములు లేవుగదా!

గౌరీ—ఉన్నవి చాలవా?

రమా—ఎక్కడున్నారని పట్టుకొనుట.

గౌరీ—రాత్రి మీరు వెళ్ళినచోటనే.

రమా—వారక్కడింకను నుందురనియా నీ నమ్మకము—వారీసరికే యెక్కడకో పోయియుందురు. ఐనను సందేహానివృత్తికొరకు వెళ్ళుదము.

గౌరీ—ఇంతవరకు మీ రెవ్వరిని దోషిగా భావించుచున్నారు ?

రమా—చూడ వలపులరాణివలె నాకు దోచినది. ఆమె చేయు ప్రకటనము—చేష్టలు—మాటలు ఇది యది యననేమి ? అబద్ధము చెప్పినదని తెలియగనే నేను గన్పెట్టితిని.

గౌరీ—ఇప్పు డేమిచేయుదము.

రమా—ఇప్పుడు గంట యెంతయైనది ?

గౌరీ—తొమ్మిదిగంటలన్నరయైనది.

రమా—ఈసరికే వారందరు గలసి వచ్చియుందురు. నీవు వెంటనే యొక ముసలివాని వేషము ధరించుము. నేను గూడ నాయుద్యమముననే యుండెదను. శైఘ్రంబ వెళ్ళవలయును.

అచిరకాలంబులో వారిరువురు యథారీతిగ వేషధారులై చలనహేతుక శకటముపై గల్యాణనగరమునకు వెళ్ళిరి. అతి శీఘ్రంబుగ వారు విశాలోద్యానమునకు జనిలోన బ్రవేశించిరి. అత్యంత మనోజ్ఞ నిర్మలశతకాంతుల నల్దిశల వెదజల్లు మయూఖుని ప్రభావ మింకను దరిగిపోలేదు.

వెంటనే వారు మొదటి భూగృహమువద్దకు జనిరి. కవాటములు తెరువబడియే యుండెను. ఆశ్చర్యచేతస్కులై వారు సోపానావళి నధిరోహించి లోనకు జనిరి. అంతయు నిశ్శబ్దముగ నుండెను. పరికరంబు లెవ్వియు నక్కడ లేకపోయెను. ఒకచో నొక్కఖడ్గంబు మణిమయమైన పిడితో నేలపై బడియుండెను? గౌరీశంకరు డద్దాని గైకొని రమాకాంతునకు జూపెను. దాని పిడిమీద "శ్యామసుందరుడు" అని యుండెను. రమాకాంతుని సంతోష సాగరమునకు దరు లెచ్చటను గానరాకుండెను. అక్క డెవ్వరు గానరామింజేసి వారు రెండవ భూగృహమువద్దకు వెళ్లిరి. ఇచ్చటనో వారిరువురును హంతకు లుందురని యనుమానించిరి. రమాకాంతుడు ప్రాకారబహిర్ద్వారము వద్దకు వెళ్ళి చూచెను. దాని కవాటములు బయటకు బీగములు వేయబడి యుండెను. వెంటనే యాబీగమును బగులగొట్టి వారిరువురు మీట నొత్తి లోనకుజనిరి. ఎచ్చటను నెవ్విధమైనవస్తువు గానుపించుట లేదు. వారిరువురి కరదీపికలను బాగుగా వెలిగించిచూచిరి. ఏమియు నగుపడ లేదు. సందేహమనుమానపిశాచపుప్రథమపుత్రిక. వారు సరిగా నధోపాతాళగృహంబునకు బోయి వెదకిరి. అచ్చట నేమియు లేదు. అంతయు నిశ్శబ్దముగ నుండెను. నిర్మానుష్యమైన నాపాతాళగృహమందు వారల కొకింత భయముకూడ గలిగెను. తదుపరి కొంతవడికి వారు మూడవ భూగృహమువద్దకు జనిరి.

ఈసారి యిక్కడ దప్పనిసరిగ హంతకు లుందురనియే తలంచి వారలు వెళ్ళిరి. తలుపులు లోన బీగము వైవబడి యుండెను. వెళ్ళగనే నతిధైర్యముతో దలుపును దట్టిరి. ఆశ్చర్యకరముగ నొకమనుజుడు లోననుండి వచ్చి తలుపులదీసెను. వెంటనే వీరిరువురు లోనకు జనిరి. అట్లు లోన కొంటెగ వారిద్దరు వెళ్ళుటలో వారియుద్దేశ మేమని నూపాఠకులు తలంతురు? వారేయుద్దేశముతోడను వెళ్ళలేదు. లోన నెంతమంది జను లుందురో యుండరో కూడ వా రాలోచించలేదు. కాని వారి యుత్సాహ మేమన నన్నపూర్ణ యక్కడ నుండుననియే. ఉత్సాహపూరితులైన వా రెట్టిపనినిగూడ నిమేషమాత్రమున జేసినైతురు! వారట్లు లోనకు వెళ్ళగనే యా తలుపుదీసిన మనుజుడు తన కరదీపికను వెంటనే వెలిగించి చూచెను. ఆనూతనవ్యక్తు లిరువు రాతని మిత్రబృందములోని వారు కారు. ఆ తలుపు తీసినవాడెవడు? ఆతడే రహీం! "మణిమయాలంకృతఖడ్గము నేభూగృహమందుననో బారవైచికొంటిమి. వెళ్ళి దానిని దీసుకర"మ్మనని హంతకులు చెప్ప రహీంవచ్చి దీనికొరకు నెదకుచుండెను. అట్లు రహీం కరదీపికా సహాయమున వారల జూచి గుర్తించి వెంటనే తన కరదీపిక నార్పెను. మరుక్షణమునందే రమాకాంతుడు తన కరదీపికను వెలిగించెను. రహీమందులేడు! ఆత డెటులనో నదృశ్యుడై పోయెను!! వారా యింట నెన్నియోమారులు తిరిగి చూచిరి గాని యెచ్చట నాతడు గన్పడడయ్యెను.

వారు తిరిగివచ్చుచుండిరి. బహిర్ద్వారము బంధింపబడి యుండెను. బీగ మెచ్చటను గన్పడ దయ్యెను. మృత్యుగహ్వరమున బడిపోతిమని వారు విచారించకపోలేదు. దానిని నాలుగుమూలల దడివిజూచిరి. ఒకచో నొకమీట కన్పడెను, దాని నొత్తగనే యాద్వారము తెరువబడెను. వార్లు బయటకు వచ్చి ధూమశకటస్థానమునకు వెళ్లిరి. అప్పుడు రెండు గంటలైనది. వారు నాలుగుగంటలన్నరకు గృహంబునకు జని నిదురించిరి. సూర్యోదయమయ్యెను. రథ్యలయందు గ్రామనివాసులగు స్త్రీలేమి పురుషులేమి యనేకమగు శాకముల నమ్ముచు గేకలు వేయుచుండిరి. రమాకాంత గౌరీశంకరు లింకను నిదురనుండి మేల్కాంచలేదు. ఉదయ మెన్మిది గంటలకు వారలు లేచి దంతధావనము జేయుచుండ రాజరత్నము వారింటికి వచ్చెను. ఆతని జూడగనే రమాకాంతున కాతని కేదియో విషయము తెలిసియుండెనని తలంచెను. రాజరత్నము ముఖభావ మట్లుండెను.

రాజ—రమాకాంతా! ఇంకను హంతకులజాడలు తెలియలేదా?

రమా—చాలభాగము తెలిసినదనియే నమ్మకము. అంతట రమాకాంతుడు దా నతనివిడచి కల్యాణనగరము వెళ్ళినదాదిగ నప్పటివరకు జరిగిన కృత్యముల నన్నిటిని విశదముగ జెప్పెను. రాజరత్న మప్పటికిని కూడ సంతోష

చిహ్నాల జూపలేదు. రమాకాంతునకు దత్తరపాటుద్భవించెను. వెంటనే రాజరత్న ముత్తర మొకదాని నిచ్చెను. రమాకాంతు డద్దాని నిట్లని చదివికొనెను.

"రాజరత్నం,

నీవు కమీషనరుపదవి వదలుకొనెదవా! లేదా! చాలకాల ముండెదనని మురసికొనుచున్నావు. నీకాలము చేరువచ్చినది. రమాకాంత గౌరీశంకరు లింక నీభూతలమందుండబోరు. వారి యంతము దాపునకు వచ్చినది. ఇప్పుడన్నపూర్ణ నెక్కడ దాచియుంచినది వారలకు కాదుగదా వారల సృజించిన సజ్జయోనికి గూడ దెలియు టసంభవము. ఈదినమునకు సరీగా నెనిమిదవదినంబున నామె నీలోకము నుండి విడదీతుము. తెలిసిచేసిన నాతడెందైన దీసుకపోవునని భయపడుచున్నామనుకొనుచున్నావా! కాదు. కాదు. ఆతని భార్యను జంపివేసెదము. ఎందుకతని ప్రయాసము? అంతయు వృథాయని చెప్పుటకొరకిప్పుడు తెల్పితిమి. సరిగా పదియవనాటిరాత్రి నీతలయు పండ్రెండవనాటిరాత్రి రమాకాంత గౌరీశంకరుల శిరంబులును దీసివైతుము. ఇది నిక్కవము. తొందరపని యుండుటవలన నింత సంక్షిప్తముగ వ్రాసితిమి. వలపులరాణి దొరకకపోదు.

ఇట్లు,

రమాకాంత మరణాభిలాషులగు

ఆనందరుటీరమువద్ద నాంతోర్పులు"

రమాకాంతుడా లేఖ నామూలాగ్రముగ జదివి నిశ్చలుడయ్యెను. తాను పాలతనునగరమునకు గౌరీశంకరునితో గలసిపోదు ననియు దప్పక యీసారి హంతకుల బట్టుకొందు ననియు జంతివార్త బంపిన పదిమంది రక్షకభటులతో శృంఖలముల దీసుకొని తాను నిర్ణయించిన స్థలమునకు రావలసిన దని చెప్పెను. మధ్యాహ్నము పదిగంటలకు వారు జిజూరు స్టేషనునకు ధూమశకటం బెక్కి వెడలిరి.

౧౪

నిదాఘతీక్ష్ణత మిక్కుటముగ నున్నది. ప్రచండ భాస్కరుడు తన నిశితతీక్ష్ణజాలంబుల నారాచికావళులవలె బాధింపజొచ్చెను. పిపాసాబాధితులైన మృగంబులు సమీప ప్రదేశంబుల నెవ్విధమైన జలాశయములుండిన నచ్చోటికరుగుటకు దనుశక్తియంతయు ధారవోయుచున్నవోయన శర వేగమున బర్వెడుచున్నవి. పంచమస్వరంబున మనోరంజకముగ బాడుకోయిల కేమికాలమోకాని చండభానుని నిశిత కిరణములచే భరింపశక్యముకానితాపము గల్గినట్లుగ, తన సహజమంజులమాధుర్యగానము తొల్లింటివలె సర్వప్రపంచమునకు వినవచ్చుటలేదు. గోగణము సమీపమందున్న పచ్చగడ్డిని మేయక సూర్యభగవానుని యసమానకిరణలాఘవంబున కోర్వలేక దగ్గరనున్న వటవిటపివితానంబులక్రింద

బరుండి నెమరు వేయుచుండెను. ధనార్జనయే ముఖ్యకర్తవ్య మని యాసపడి యెండవానలను గోటమిాటుచు, మాధుర్య మైన చూతఫలంబులను జనుల కమ్ముచుండిరికదా కొందరు మనుజులు. పధికుల యాయాసమును వర్ణింప నశక్యము. కాలిడినంతమాత్రమున పచ్చనిగడ్డిపైననుకూడ కాళ్ళు మల మలమాడుచుండ. శిరము దినకరుని తేజముచే గుందుపడ, ముఖము స్వేదావృతమైయుండ, శరీరము గంపర మొంద నాపధికు లాయాసముతో నడచుచు. మధ్యమధ్య లేమావి గున్నలక్రిందను నశ్వత్థవృక్షశాఖలక్రిందను నిలువంబడుచు నడచుచుండిరి. అట్టితరి పాలతనునగరముపై పోకపాంథు డతి కష్టముతో బోవుచుండెను. ఆతని వెనువెంట మరియొకపాంథు డుగూడ నడచుచుండెను. ఆముందుబోవువానిని జూచినప్రతి మానవుడు నాతడొక యోగీశ్వరుడని చెప్పకతప్పదు. ఆతడు సమున్నతమైన గడ్డముగల్గి, రుదురాక పేరులు గళంబుచుట్టు ను గలగలమనిధ్వనింప, పాదరక్షలొక్కడుగిడినంత మాత్ర మున మడమలకు నొకవింతధ్వనిని జేయుచుండ, కాషాయ వల్కలధారియై, భసిత రేఖలు మేనంతయు వెండి రేకులవలె మెఱయ, నిండుచందురు బరిహసించు నెమ్మోమున నివురు గప్పిన నగ్నిస్ఫులింగమువలె గుంకుమబొట్టు అరుణకాంతు లచే నలరార నొక యోగిపుంగవుండు జనుదెంచుచుండెను ఆతని ననుసరించుచున్నవా డతనిశిష్యు డని చెప్పకతీరదు.

ఎందుకన నాతనివీపుననుండు కాషాయాంబరముల మూటను నాతని వామహస్తముననున్న గంజాయిపీల్చు గొట్టమును జూడ నాతఁడు నిక్కముగ నాతనిశిష్యుడనియే తలంతురు. చదువరీ! ఆతురపడకుము. వారే మాయావల్కలవేషధారు లైన రమాకాంత గౌరీశంకరులు. అట్లాయోగివరులు పాల తనునగరము జేరి శ్యామసుందరుని భవన మడిగి తెలిసికొని యాతనిబహిర్మందిరమున నున్నాడని తలంచి యచ్చటికేగిరి. ఆమందిరము సునాసీరుని యంతర్భవనమునకు దీటుగ నానా విధాలంకారములచేతను, అమూల్యనూత్నరత్నసామర మేదు రకంబళములచేతను, తైలచిత్రచిత్రితములచేతను నలరారు చుండెను. వారిద్దరు వెళ్ళుసరికి యచ్చట నొకకుర్చీలో సుందరు డైనపురుషుఁడు కూర్చుండియుండెను. ఆతడే శ్యామసుందరు డని యాతని రూపురేఖావిలాసముల గాంచి వార లనుకొనిరి.

యోగి—జయ్! జయ్! సీతారాం!

శ్యామ—ఎవరు మీరు?

యోగి—మేము సాధులము.

శ్యామ—ఏమిపని?

యోగి—మేము రామేశ్వరయాత్ర వెళ్ళుచున్నారము ధనసహాయము జేతురని తమదర్శనార్థమై యిట వచ్చితిమి. తరువాత తమదయ.

శ్యామ—అట గూర్చుండుడు. తాము శాస్త్రజ్ఞులా?

యోగి—మాకు జ్యోతిషమందు ప్రవేశముగలదు. భూతభవిష్యద్వర్తమాన కాలంబుల జరుగునంశముల వారి వారి జన్మనక్షత్రముల దెల్పిన జెప్పగలము.

శ్యామ—హస్తసాముద్రికము తెలియునా?

యోగి—ఎక్కువ ప్రవేశము లేదు.

శ్యామ—నాకు దెల్పుదురా?

యోగి—ఆ! చెప్పకేమి, తమజన్మతార దెల్పిన జెప్పెదము.

పాఠకమహాశయా! ఇకనుంచి రమాకాంతు నానంద యోగి యనియు గౌరీశంకరు నాంజనేయ దాసనియు బిలుతము.

శ్యామ—తమ పేరేమి?

యోగి—ఆనందయోగి. ఇతనినామ మాంజనేయ దాసు.

శ్యామ—నాది విశాఖ, మూడవపాదము.

అంత టానందయోగి తన వేళ్ళ ననేకవిధముల ద్రిప్పుచు పైకి జూచుచు, ఆలోచనాభినయము గనులమూయుచు, లటాటంబును గుంచించుచు దనలో దాను "రవియష్టమ స్థానమున కేంద్రంబున నుండుట జేసి, కుజుడు ద్రేక్కాణమున శనిసప్తస్థానంబు జూచుటవలన, అంగారకు డుచ్చస్థానము నందు—"ఇవ్విధముగ నేవియోయస్ఫుటవచనంబుల బల్కుచు దనయభినయము నక్క డత్యద్భుతంబుగ జూపెను. కొంత వడికి—

ఆనం——శ్యామసుందరా! ఆలోచించి నీపేరునుబట్టి చూడ నీవొక రాజేంద్రుడవు. భూతకాలమున జరిగిన యంశ మొకదాని జెప్పెద స్మరణకు దెచ్చుకొమ్ము. ఒకప్పుడు నీవు మృగయావినోదంబునకు జని యచ్చట నేకయిడుమల బడితివి నీశిరము యూపమున గట్టబడినది. నీస్నేహితజాలంబులో నొ రొయొకడు నీకద్దాని దప్పింపజేసెను.

శ్యామసుందరుని యానందమునకు మేరయే లేదు. ఆతని సంతోష సముద్రము జ్యోతిష చంద్రికాగతమున నుప్పొంగినది. ఇంతలో నక్కడకొక నూతనవ్యక్తి వచ్చెను. ఆతని జూడగనే యానందయోగి యాతని రాజారావని గ్రహించెను. వెంటనే——

శ్యా——రాజారావూ! వీరు జ్యోతిష్కులట. భావి కాలము చెప్పెదరు. సమర్థులనియే నమ్మకము.

రాజారావు ఆనందయోగి నతి తీక్ష్ణముగ బరికించెను.

ఆనం——అయ్యా! ఇక భావికాలము జెప్పమందురా?

రాజా——మా శ్యామసుందరుని దేహా?

ఆనం——ఔను! ఈతడొక స్త్రీమూర్తికై పరితాప పడుచున్నట్లున్నది. అద్దానికొరకితడనేక ప్రయాసముల కోర్చుచున్నాడు. వింశతిదినంబులలో సఫలమగును. ఇది శ్రీరామవాక్యము.

రాజా——అయ్యో! ఇకవద్దు చాలును.

అంత వారేదియో హిందీభాషలో మాట్లాడుకొనిరి. ఆనందయోగికి వారనుకొనిన విషయము తెలియకపోలేదు. ఆత డన్నిభాషలలోను నారితేరిన ప్రౌఢ. ఆతని యెదుటనా వీరల యాగడములు అంత—

రాజా—తామెక్కడనుంచి వచ్చుచున్నారు?

ఆనం—నాసికాత్రయంబకమునుండి వచ్చుచుంటిమి.

రాజా—దయచేసి నాకుగూడ భావికాలఫలముల జెప్పుడు. నాజన్మనక్షత్రము శ్రవణము పాదము తెలియదు.

ఆనం—అట్లయిన వినుము. స్మరణకు దెచ్చుకొనుము.

నీకు వైద్యమందసమానమైపుణ్యము గలదు. దానిచే నీవు చాలధనము సంపాదించితివి. ఇంకను సంపాదింతువు. నీవు నీకు పదునైదవవత్సరంబున వణిజునివద్ద గుమాస్తాగా నుంటివి. ఇదివర కొక మనుజుని నీస్నేహితునిచే బాధింప జేసితివి. స్త్రీనొకతెను ఒక మనుజునకు గట్టిపెట్టవలెనని తలంచితివి. అది యిరువదిదినంబులలో జేకూరును.

రాజా—ఇక వద్దుస్వామీ! మీరసమానపండితులు. మీకేమి కావలయును?

శ్యామ—వీరు మనకు భావికాలము జెప్పుచు సహాయభూతులుగ నుందురు.

రాజా—ప్రతిఘుడియకు గూడ జెప్పగలరా?

ఆనం—మీరు చేయబోవు కార్యముల సూచనగ

ప్రసంగించిన నది సఫలమగునో కాదో చెప్పగలము. శ్రీరామ మంత్ర ముపాసించి ప్రతిఘడియకు గూడ జెప్పగలము.

రాజా—శ్రీరామమంత్ర ముపాసించి రాబోవు పది నిముషంబులలో నేమగునో జెప్పుడు.

ఆనం—(ఆలోచించి) మరియొక ఘడియకు మీకును మాకు నెడతెగని సఖ్యముగూడును. (పరికించి) రెండునిముష ములలో మీ మిత్రుడు వచ్చును. శీతారాం! జయజయరాం!

రాజా—చూతుముగాక.

ఇంతలో ననుకొనిన రీతిగనే యొకవ్యక్తి యచ్చటకు వచ్చెను. వారల విస్మయమునకు మేరయే లేదు.

శ్యామ—రామరాజా! ఏమిపని! ఎక్కడనుండి?

ఆ నూతన వ్యక్తినామము రామరాజని యానంద యోగి యాంజనేయదాసు లనుకొనిరి. ఆతడు వచ్చుచున్నా డని యానందయోగి యెట్లు చెప్పగలైనన్న రామరాజు మొదట బయట నిలుచుండి యా యోగీంద్రు లెవ్వరోనని పరికించు చుండ నది సమయానుకూలముగ నానందయోగి గనిపెట్టి వారలడిగిన ప్రశ్నంబునకు సదుత్తరం బిచ్చెను. దైవ వశమున నాతడుగూడ రెండునిముషములలో లోనకువచ్చెను. వెంటనే రామరాజు కానందయోగిజ్యోతిషప్రభావమంతయు జెప్పెను. వారందరు సంతోషదాయకముగ నుండిరి.

శ్యా—యోగీంద్రా! మీకు వలయువస్తుజాలము

లన్నియు దెచ్చియిత్తుము. మాయొద్దనుండుడు. మాకుగావలసినవి చెప్పుడు.

ఆనం—ఆలాగే చెప్పుదును. కాని నాకు రామేశ్వర యాత్రయున్నదే. అదెట్లు పూర్తియగును.

శ్యామ—మీరు వెళ్ళవలసియున్న నిరువదిదినంబుల తదుపరి వెళ్ళవచ్చును. అందనుక యిక్కడనుండుడు. తరువాత వలయుధనము తీసుకుని వెళ్ళవచ్చును.

తరువాత చాలతడవు మరికొన్ని భగవద్విషయముల జర్చించుకొని తమతమనులకు బోయిరి. ఆనందయోగికి రాజుగారి మందిరంబులోనె నొకగది నిచ్చిరి. ఫలంబు లనేకంబు లాతని కిచ్చి వెడలిరి.

౧౫

కాలచక్రము తిరుగుచున్నది. అది తిరుగుచున్న కొలది నిముషములు గడచిపోయినవి. గంటలు దాటిపోయినవి. దినములు దూరమైనవి. ఆనందయోగీ యాంజనేయదాసులు వారలకు బ్రాణపదములైరి. ఏపనిచేసినను వారల నడుగనిదే చేయరు. వారలసహాయము లేనిదే యేపనియు జేయరు. ఒకరోజున శ్యామసుందరుడు, రహీం, రాజారావు, రామరాజు మున్నగువారలు గదిలోనకువచ్చి కూర్చుండిరి. అందులో రాజారా విట్లనియడిగెను.

రాజ—యోగిచంద్రమా! మే మేమాలోచించి నీ కడకు వచ్చితిమో చెప్పుదువు? మీతోడ మాటాడవలయును.

ఆనం—(ఆలోచించి) సీతారాం! మీ రొకయువతిని బరిమార్పగా నెంచివచ్చినారు. ఇది శ్రీరామవాక్యము. జయజయరాం.

అందరు విస్మితులైరి. ఆనందయోగి వార లడిగిన దాని కెల్ల ప్రత్యుత్తరము జెప్పగలైనన్న నాదినము తాను వారితో సఖ్యముచేసినయారవదినము. హంతకులు రాజరత్నమునకు వ్రాసిన యుత్తరములో దా మన్నపూర్ణమ్మను నెనిమిదిదినంబులలో జంపివైచెదమని వ్రాసినందున నప్పటి కారవదినమగుటంజేసి హంతకులగువారలు తత్ప్రయత్నమున నుండిరని గ్రహించి పల్కెను. అంత—

రాజా—ఆనందయోగీ! మే మొకయువతి నొకచో దాచియుంచితిమి. దయయుంచి యిది యెవ్వరితోడను జెప్పకుడు.

ఆనం—చెప్పను. నేను మీశ్రేయోభిలాషినిగాని మిమ్ములవంచించు బాలిశాధముని గాను. ఇది శ్రీరాముని యాజ్ఞ. జయ్ సీతారాం.

రాజా—ఆ స్త్రీని యీయూరి వెలుపలనున్న దేవాలయంబున దాచియుంచితిమి. ఎల్లుండి చంపదలచుకొన్నారము, రాజులే యిట్లు చేయుచున్నారని తలంతురేమొ? వారు పరమ

దుర్మార్గులు—నృశంసులు. అందులో మిగుల చాలిసుని భార్యను రక్షకభటులచేబట్టి బంధించితిమి. అది విని యామె భర్త వచ్చుననియు నట్లు వచ్చినభర్తను బంధించిన దుర్మార్గులజాడ తెలియుననియు దలంచి చేయుచుంటిమి. మాకార్యము నిర్విఘ్నముగ గొనసాగునాయని మిమ్ముల నడుగుచున్నారము.

ఆనంద—మిమ్మంతకష్టపెట్టు దురాత్ముల నుక్కడగించుడు. ఇది సర్వోత్తమమైన కార్యము. మున్ముందుగ నే నడిగిన ప్రశ్నల కుత్తరం బిచ్చిన సదుపాయ మాలోచించి ఫలాఫలములు సంపూర్ణముగ జెప్పగలను.

రాజా—అంతకన్న నెక్కుడు ప్రశస్తమైన విషయ మేమిగలదు.

ఆనం—దేవాలయ మేడ ?

రాజా—అదియొక పాతాళజీర్ణ దేవాలయము. అది యీయూరి వెలుపల నున్నది. ఈసాయంత్రికి మిమ్ముల దీసుక వెళ్ళెదము. తరువాత మీకంతయు దేటదెల్లముకాగలదు. దయాసాంద్రులై మాకార్యము నిర్విఘ్నముగ గొనసాగునో విఫలమగునో తెలియజెప్పుడు.

ఆనం—జేజేరాం! జానకిరాం! సీతారాం! దశరథ రాం! శ్రీరాం! (ఆలోచించి) మీకార్యము నిర్విఘ్నముగ గొనసాగునని రామవాక్యము.

అందరు సంతోషాక్రాంతచిత్తులై వెడలిపోయిరి. ఈ కపటయోగి ఆహా! దుర్జనులపాలిటి కల్పతరువై యడిగిన దెల్ల జ్యోతిషవృత్తాంతమను పేర రామవాక్యమనుచు దెల్పుచున్నాడు! సంధ్యాసమయ మగుటంజేసి వారు శీఘ్రముగ రాజోద్యానమధ్యప్రవహిత పూతగంగోపమ జలంబువద్దకు తమ సంధ్యాక్రియల నిర్వర్తించుటకు జనిరి. ఈమాయా వల్కలధారులై, భయంకరసంఘటన రహస్యభేదన జయ సూచకాయతచిత్తులై యుండిన రమాకాంత గౌరీశంకరులకు సంధ్యావందన సమయమాయది? కాదుకాదు. ఆసమయమునసే నక్కడనే వారలు రహస్యకార్యాలోచనలు చేయుస్థలము. అదిగో సమయము. ఆనందయోగీ యాంజనేయదాసు లచ్చటకుజని యచ్చట నీళ్ళలో గాళ్ళుంచి మాటాడదొడగిరి.

ఆనం—గౌరీ! నీవిప్పుడు బయలుదేరి తంతివార్తాస్థానమునకు జని రాజరత్నమును పదిమంది రక్షకభటులతో వెంటనే రమ్మనమని తంతివార్త యిచ్చి యొక అరగంటలోనె తిరిగిరావలయును. ఆతను పాలతనునగరముజేరిన తమపరి రక్షకభటస్థానమున నుండినయెప్పుడవసరమైనదియు సంగతులన్నియు నేనువచ్చి చెప్పుదునని తంతివార్తయిచ్చి రమ్ము. నీవు వచ్చినదాక నేనిచ్చటనె యుండెద.

అంత టాంజనేయదాసు వెడలిపోయెను.

విచిత్రముగ రాజారావచ్చుటకు వచ్చెను. రమాకాంతు డాతనిజూచి విస్మయ మొందెను.

రాజా—స్వామీ! మనము రేపుసాయంత్రికి వెళ్ళుదము. ఎల్లిదాని నంత మొందింపవలయును.

ఆనం—నాయాలస్య మేమియు లేదు.

రాజా—ఆంజనేయదాసులవా రేరీ?

ఆనం—బహిర్దేశమునకు వెళ్ళినాడు.

రాజా—ఈవిషయ మతనితో జెప్పకుడు సుమా! మీకు మాకును దప్ప మరియొకరికి దెలియగూడదు. లేదేని ముప్పు వాటిల్లును.

ఆనం—ఆత్మసాక్షిగ నే జెప్పను.

అంత రాజారావు వెడలిపోయెను. క్రమముగా చీకటులు గ్రమ్మసాగెను. ఆంజనేయదా సింకను రాకుంజేసి యానందయోగి తన గదిలోనకు వెడలిపోయెను.

౧౬

సాయంకాలసమీరము సర్వజనాహ్లాదకరముగ నుండెను. గోధూళికాసమయ మగుచున్నది. పసులగాపరులు విలాసముగ బాటలుపాడుచు పసువులదోలుకొని వచ్చుచుండిరి. భూసురులు తమ నిత్యనైమిత్తిక కామ్యకర్మానుష్ఠాన జపతపహోమస్వాధ్యాయముల నిర్వర్తించుటకు సమయమాసన్నమైనది శృంగారవతులు చామంతికావకుళచంపకజాజి

కాది వికసితపుష్పముల కుంతలములను జక్కగ సంస్కరించుకొని యందు విలాసముగ ధరించి సాయంకాలమలయమారుతము గ్రోలుచు వింతభవనంబులపైనున్న పిల్లగోడలపై గూర్చుండి వీణాగానముసేయు చుండిరి. జలాశయతరంగడోలికామాలికలపై నుయ్యెలలూగి, పుష్పసౌరభ్యమును గొల్లలాడి వచ్చుచున్న నాసంధ్యాసమయ మలయమారుత మెవ్వరికి మనోదాయకముగ నుండదు. అట్టితరి రాజోద్యానమధ్యప్రవహిత జలాశయంబు గట్టుల నిరువురు వ్యక్తులు కూర్చుండి మాట్లాడుచుండిరి. వారిలో నొక డానందయోగి, రెండవవా డాంజనేయదాసు.

ఆనం—దాసూ! వెళ్ళినపని యైనదా?

ఆంజ—తమ యనుగ్రహమున దంతివార్త నిన్ననే యిచ్చితిని. ఈసాయంత్రం వెళ్ళి చూచివచ్చితిని. రక్షకభటస్థానమున రాజరత్నమును, పదుగురు రక్షకభటులును, నున్నారు. వలపులరాణిని వచ్చునపుడు దర్శించివచ్చినారట. ఆమె "మోహన్‌లా లింటలేడనియు, అతడు నాలుగురోజుల నుండి యింటివద్ద లేడనియు, చూడ నాతడు హంతకునివలె దోచుచున్నదనియు" జెప్పినదట. మోహను డేమైన—

ఆనం—మోహన్‌లాలా! ఈతనికి శ్యామసుందరునకు సంబంధమేమియు లేదే. ఒకతూరియైన నాత డిక్కడకు రాలేదే. సంబంధమున్న రేపు రాకపోడు. అప్పుడు నే గనుపెట్టకపోను.

అంజ—రేపేమి యంతవిశేషము!

ఆనం—రేపే యన్నపూర్ణమ్మను జంపుదినము. హంతకులందరు గలుతురు. ఏదోవేళకు ఈరోజునగాని లేక తప్పక రేపుగాని హంతకులు చిక్కకపోరు. కాని ప్రకృతమాలోచింతము. నీవీరాత్రి రక్షకభటస్థానమునకువెళ్ళి రాజరత్నముతోను రక్షకభటులతో శృంఖలముల దీసికొని యీయూరిచివర నున్న నుద్యానవనములో నుండుడు. నేను వారలతో వచ్చి 'జయరాం' అని నుడువగనే మీరు జాగరూకులై మమ్ముల ననుసరింపవలయును. మేము లోనకువెళ్లి జీర్ణదేవాలయము లోనకు వెళ్ళునంతవరకు మీరు వారల నేమియు ననవలదు. లోన తరువాత బంధింపగలము. అచ్చటనే మీయత్తె బంధింపబడినది. కార్యమధ్యమున మీరతిజాగరూకులై మెలంగవలయును. లేకున్న పనియంతయు విధ్వంసమగును. అట్టిసమయమున హంతకుల బట్టుతెరవులేదు. అన్నపూర్ణమ్మను గోల్పోదుము. బహుమతియూ రాదు. మనమూ తుదకు వీరిచే నకాలమరణ మొందవలయును. జాగ్రత—

అంత వారు తమతమపనులకు బోయిరి.

* * * * *

ఆనందయోగి యాశ్చర్యమునకు మేరయేలేదు. అతడు కలగనుచుండెనేమో తెలుసుకొనజాలకపోయెను. ఆతని మనంబు నూతన భయంకరసంఘటనంబున కువ్విళ్ళూరుచుండెను. హృద్వేగము వాయువేగము నోడించినది. ఇంతను నా

కపటయోగి ప్రదర్శనమేకదా రమాకాంతుడు ధరించియుండుట. ఇంక నాయసమానాభినయమే. ఆనందయోగి రాత్రి యెనిమిదిన్నరగంటలకు దుష్టచతుష్టయముచే దారిచూపబడ వారి ననుసరించుచుండెను. ఆతడు నడచునది రథ్యగాదు—పల్లెగాదు. పవలే సంధకారబంధురంబయి గాన్పించు నొక సారంగము! ఆసారంగము రాజాంతఃపురస్థిత శయ్యాగారము నుండి యున్నది! వారట్లు చాలతడవు వడివడిగనడచి యొకచో జేరిరి. అక్కడ బమ్మచెవిటి వాసన భరింప నశక్యమయ్యెను. అంతయు నంధకారసమావృతమై యుండెను. అచ్చట పవలే పాంథులజంపుదురను భీతి యానందయోగికి గల్గెను. చింతాక్రాంతచిత్తుడై పోయెను. కాని విషాదమును లోలోనడంచుకొనియెను. గౌరీశంకరుడు లోన కెట్లువచ్చునా యని పల్మారాతడనుకొనెను,

ఆనంద—రాజారావుగారు! ఈపొద దాటుటెట్లు? ఉద్యాన మనినారే! ఏది యాయుద్యానము?

రాజా—బయటనుండి వచ్చిన నుద్యానమునుండి బమ్మచెవిటి పొదదాటి యిక్కడకు రావలయును ఆబొమ్మచెవిటిపొదను నొకతూరి చుట్టిన యొకచో రెండు శిలాస్తంభములనడుమ నొక కొంకెయుండును. అచ్చటనే నాకొంకెతో నక్కడనున్న పొదను విడల్చిన మార్గమేర్పడును. లోనకు వచ్చిన మనముచేరిన యీ స్థలమునే చేరుదురు.

రామ—(రహస్యముగా) రావూ! విపులముగ జెప్పెదవేమి? ఏపుట్టలో నేపామున్నదో యెవ్వరెరుంగుదురు?

రాజా—ఈత డెక్కడకుబోవును. ఈతనికూడ చివర కంత మొందింపుమా ?

ఈరహస్యమంతయు రమాకాంతుడు వినకపోలేదు. ఇంతలో రాజారావక్కడనున్న మీటనొత్తెను. తోడనే శిలానిర్మితమైన యాగోడ రెండడుగులు క్రుంగెను. వారందరాగోడను దుమికి యావలి భాగమునకు జనిరి. అచ్చట నొక శిలానిర్మిత భయంకర వికృతకాళీ విగ్రహము ! రాజారావు వెంటనే దానినాసికనుబట్టి లాగెను. విస్మయము నాపుటకు సృష్టికర్తయైన కమలజుని కైనను దరముగాదు. ఆనందయోగి యాశ్చర్యసంభ్రమునకు పారావారమే లేదు. ఆకస్మికముగ నావిగ్రహము రెండుభాగములుగ విచ్ఛిన్నమైపోయెను. తోడనే నక్కడ నొక సొరంగముండెను. వార లాసొరంగము గుండ నడచిపోయిరి. కొన్ని శిలానిర్మితసోపానముల దిగి లోనకు జనిరి. అదియే జీర్ణదేవాలయము. చతుశ్శాలాభవన జీర్ణదేవాలయము. అచ్చటనొక బల్లయుండినది. దానిచుట్టును కుర్చీలమర్చబడియుండెను. వారందరటనాసీనులైరి. అంతట రహీమొకయువతి నొకగదినుంచి తీసుకువచ్చి యొకబల్లపై బరుండబెట్టె. రమాకాంతున కొక్కసారి క్రోధదుఃఖము లుప్పొంగెను. అది క్రోధవిషాదములకు తావుగాదు. నిశ్చలుడై కూర్చుండి చూచుచుండెను. ఆస్త్రీమూర్తి తనభార్యయగు నన్నపూర్ణమ్మవ్యక్తి ! అన్నపూర్ణమ్మ యన్నపానీయములు లేక కృశించిపోయినది. నికచేందీవర సదృశవిశాలలో

చనముల తీక్షణత కృషించినను సౌకుమార్యమును దగ్గింప లేదు. సుందరకుటిలాలకంబుల శోభ పూర్ణేందుబింబోపమము ఖంబునుగప్పి శోభయిడుచుండినను నర్ధస్ఫుటంబులైన కనులు స్ఫుటంబుగ గానకుండిన లోచనంబుల దరుగును గప్పివైచు చునేయుండెను. జీర్ణవస్త్రముల ధరించినను సుకుమారవహా సౌందర్యమునకు కళతగ్గించలేదు. భయంబుచే నామె మరల గనుల మూసెను.

ఆనం—ఈమెనేనా మీారు చెప్పినది.

రాజా—ఔను. మీాయుద్దేశ మేమి?

ఆనం—అవశ్యకరణీయమే ముఖ్యకర్తవ్యము. మీా పని సఫలమగును లెండు.

కొంతెవడి కందరు మరల తిరిగివచ్చిరి.

౧౭

ఆనందయోగి తనగదిలోనకు వచ్చుసరికి యాంజనేయ దాసు పరుండి యేదియో నాలోచించుచుండెను.

ఆనం—ఆంజనేయదాసూ! ఏమోయి చాల యాశా భంగము కలిగినది.

ఆంజ—ఎంతసేపో తమకొరకు నిరీక్షించితిమి. మీా రెంతకాలమునకు రానందున వెడలివచ్చితిమి. తరువాత రాజరత్నమును రక్షకభటులను యథాస్థానమునకు జేర్చి యిటవచ్చి పరుంటిని.

ఆనం—రాజుగారి శయ్యాగారమునుండి యొక సొరంగముండినది. వారు నన్నందులోనుండి తోడ్కొని వెళ్ళిరి. మేము సొరంగము దాటినదగ్గర నొక శిలానిర్మితమైన గోడ గలదు. అక్కడ నున్నమీట నొత్తిన నాగోడ రెండడుగులు క్రిందికి గ్రుంకును. దానిని దాటి యావలివైపునకు బోయిన నక్కడ శిలానిర్మిత కాళీవిగ్రహ మొండుగలదు. దాని నాసికనుబట్టి లాగిన నది రెండుభిన్నములగును. అక్కడ నొక సొరంగము గాన్పించును. దానిలో సోపానపంక్తుల నవరోహించి దిగిన జీర్ణదేవాలయము గాన్పించును. దానినడుమ నొక బల్లగలదు. నాలుగు గదులుండును. అందులో నొక దానియందుననే నన్నుపూర్ణను దాచిరి.

ఆంజ—అత్త కనుపడినదా!

ఆనంద—చాలా శుష్కించిపోయినది. నన్ను జూడ లేదు. ఈ దినంబున జంపుదురట. ఈదినముననే గడుంగడు జాగ్రతతో మెలగవలయు.

ఆంజ—ఆకంచె దాటు టెట్లు?

ఆనం—ఆకంచె చుట్టును దిరిగిచూచిన నొకచో రెండు శిలాస్థంభము లుండును. అచ్చట నొక కొంకియుండును. దానితో నక్కడనున్న పొదలాగివేసిన మార్గ మేర్పడును. లోనకు వచ్చి నేచెప్పినతీరుగ నాగోడవద్దకు రాగలరు. నీవు ముందుగా వెళ్ళి వారల బయటనుంచి లోన నొక గదిలో దాగుము. నేను సంజ్ఞచేయగనే వారల లోనకు తీసుక రావలయును. ఆలసింపక పట్టి బంధింపవలయును.

అంతట ఫలంబుల గొన్ని భుజించి వారు నిద్రాసక్తు లైరి. నిముషంబులు గడచినవి. గంటలు గతించినవి. జాములు దాటిపోయినవి. ఉషఃకాలము సమీపించినది. బ్రాహ్మణులు కాలకృత్యముల నెరవేర్చుచుండిరి. కుక్కుటంబులు కంఠంబుల నెత్తి కూయుచున్నవి. విహంగసముదాయము తమకులాయంబుల మేల్కాంచి యాహారార్థము ప్రపంచమున దిరుగాడ జొచ్చినవి. కోయిల పంచమస్వరంబున సవిలాసంబుగ బాడ దొడంగెను. అట్టితరి పాలతను నగరమందు రథ్యలో నొక మనుజుడు పోవుచుండెను. అప్పు డానందయోగి యరగుపై గూర్చుండి దంతధావన చేయుచు నాతనిజూచి—

ఆనం—రాజరత్నం!

రాజ—(ఆశ్చర్యముతో) ఇదేమి వేషము!

ఆనం—ఇక్కడ ధరించవలసిన దిదియే ఈరోజున హంతకుల బట్టవలయును గౌరీశంకరుడు సాయంత్ర మేడు గంటలకు రతికభట స్థానమునకు వచ్చును. కర్తవ్యమేమో ఆతనితో జెప్పితిని. కడు జాగ్రతగా మెలగవలయు.

రాజ—సరియే లెండి.

అంత టానందయోగి లోనకువచ్చెను. ఒక అరగంట తదుపరి దుష్టచతుష్టయ మతనివద్దకు వచ్చెను.

రాజా—స్వామీ! ఈదినము మంచిదేనా?

ఆనం—ఎందుకు?

రాజా—నిన్నదర్శించిన స్త్రీవధకు.

ఆనం—(ఆలోచించి) జయ్ రాం సీతారాం. అటులైన సుదినమనియే రామవాక్యము. నక్షత్రయోగకరణములు సరిపోయినవి. అవశ్యకరణీయమే నా ముఖ్యాభిప్రాయము.

రాజా—మీ సాన్నిధ్యముననే జరుగవలయు.

ఆనం—హాతోస్మి! నాయెదుటనా! నే నట్టి కఠోర కృత్యంబును జూడజాల.

రాజా—ఎటులైనను మీకు తప్పదు. ఇంతకు మా కోరిక సఫలమగునా?

ఆనం—సఫలమగునని రామవాక్యము.

అందరు జయజయ ధ్వానులతో వెడలిపోయిరి.

క్రమముగా సంధ్యారాగ మంకురించినది. ఆకాశమందు పశ్చిమదెసయం దరుణరాగము కుంకుమపూతవలె నొప్పారుచుండెను. ప్రచండభాస్కరుడు తన సతీమణి పశ్చిమదిశాంగనను జూచి కాబోలు తన కోపమంతయు తగ్గించి మోహంబుతో నామె భవనంబునకు జనెను. ఇంతలోనె రక్షకభటుని బయటబడు తస్కరునిభంగి తమము విరియ జొచ్చెను. క్రమముగా చెట్లు గుట్టలు మరుగుపడియెను, ప్రతి గేహంబునను దీపకాంతు లలరారుచుండెను. ప్రథమయామము గడచినది.

ఆనందయోగియు, శ్యామసుందరుడును, రామరాజును, రాజారావును, రహీంను, విశ్వాసరావును, మరియొక నూతన వ్యక్తియు గలసి రాజాంతఃపురస్థితగుప్త మార్గంబుగుండ

నడువజొచ్చిరి. ఆనూతనవ్యక్తి యెవ్వఁడో గుర్తించుటకంత యు నంధకారబంధురంబై యుండెను. కొంతవడికి వరుసగా హారాశిలాప్రాకారముదాటి లోనకుజని కాళీవిగ్రహమునకు నమస్కరించి దానిలోనున్న సొరంగముగుండలోనకు జీర్ణ దేవాలయములోనకు జని కుర్చీలపైనాసీనులైరి. పనులత్యంత శీఘ్రకాలంబున జరుగవలెనని యానందయోగి హెచ్చరించె. ఆనూతనవ్యక్తి యెవ్వఁడో గుర్తించుట కాతడు నీలాంబరము లచే దన యావచ్ఛరీరము గప్పినైచుకొనుటచే వలనుపడినది గాదు. ఆనందయోగి యొక్క గవాక్షమువద్ద గూర్చుండెను. ఆంజనేయదాసను పేరుగల గౌరీశంకరుఁడు తన మాయచేయి తడివెను. సంకేతమైనది. అన్నపూర్ణమ్మను కట్టువిదల్చి వధ్య శిలయందు బరుండబెట్టిరి. అంతరాజారావు లేచి యొకసభ జరుగవలెనని చెప్పెను. శ్యామసుందరు డధ్యక్షుడుగనుండి యిట్లు చెప్పదొడంగెను. “అందరకు నేను విన్నవించునది యొక విషయము. ఆనందయోగీ! మేము చెప్పుకొనువిష యము నీవన్యథా తలంపవలదు. రత్నలాలు హత్యలోనేమి తరువాతనేమి హెచ్చుగా శరీరకష్టపడి పనిచేసినది రాజారావు విశ్వాసరావులు. వారలకు నేను కృతజ్ఞుడను. మేధాశక్తి ధారవోసినది రామరాజు. ఆతనికి నమస్కారము. అత్యంత కష్టంబులబడి దెబ్బలుతినిన దీరహీం. ఆతనికి పదివందల రూప్యములిత్తునని వాగ్దానముచేసితిని. ఆలోచన చెప్పి మనకు దోడ్పడినది యానందయోగి” కాని యానూతన నీలాంబరా

వృతశరీరునిగూర్చి యేమియు జెప్పలేదు. వేళ నిర్గమించు చున్నదని యానందయోగి హెచ్చరించెను. వెంటనే యక స్మాత్తుగ నక్కడనొక కోలాహలమయ్యెను. తక్షణమే పది మంది రక్షకభటులును రాజరత్నమును నచ్చట బ్రత్యక్షమైరి. వారిచేతులలో రివాల్వర్లును ఖడ్గంబులును మెరయుచుండెను. అందరు భయవిస్మయావేశులై లేచిరి. ఇంతలోనె రాజరత్న ము "దురాత్ములారా! ఒక్కడు గిడిన శిరంబులు నేలగూ లును—తెలియునా!" అని గద్దించిపల్కెను. వారు నిశ్చేష్టి తులై పోయిరి. ఆనూతనవ్యక్తి ముఖము వివర్ణమైపోయినది. శ్యామసుందరునిముఖము వాడిపోయెను. కను లశ్రుపూరిత ము లయ్యెను. వెంటనే రక్షకభటులు తమ జేబులనుండి యొక్కొక్కజత నొక్కొక్కనికిదగిలించిరి. వారు భయకంపి తులై నిశ్చేష్టులైరి. అందరు పట్టుబడిరి! వెంటనే యానంద యోగి తన యంగిని రుదురాక పేరులను గడ్డముచు తీసివేసెను. తోడనే రమాకాంతు డయ్యెను. హంతకుల కోపాశ్చర్యము లిక వర్ణింపశక్యముకాదు. రమాకాంతుడు వెంటనే యా నూతననీలాంబరధారుని యంబరముల విదల్చుడని యాజ్ఞా పించెను. వెంటనే రమాకాంతున కాశ్చర్యము—చిత్తవ్య కలనము—మతిభ్రమణము— సంభ్రమము—ఆనూతనవ్యక్తి మోహనలాల్!

ఇంతలో రమాకాంతు డచ్చటలేడు. ఆతడొక సొరం గమున దూరెను. తోడనే యొకపాతాళగృహమున బడి

పోయెను! అంతయు దుర్గంధముగ నుండెను. చీకటి విరియ బడి యుండెను. తోడనే రమాకాంతుడు తన కరదీపికను వెలిగించిచూచెను. జలము ప్రవహింప జొచ్చెను. ముందు రాజారా వీదుచుండెను. క్రమంబుగ జలంబు హెచ్చెను రమాకాంతు డీతయం దారితేరిన బ్రజ్ఞావిశేషముగలిగియుంట జేసి కడుంగడు సమర్థతతో నీదుచుండెను. ఆతడు మరల ముందునకు జూచెను. ముందు రాజారావు లేడు! ఆత డెట్లో నంతర్హితుడయ్యెను. రమాకాంతునకు మార్గముగోచరముగ నుండెను. తన కరదీపికను మరింత పెద్దదిగా జేసి ముందునకు జూచెను. ఒకచో నొక గవాక్షముండెను. ఆత డీసారి యావైపునకే యీదుచుండెను. శీఘ్రంబుగ నాగవాక్షమునుండి బయటకు దుమికెను. అట్లు దుముకునప్పు డాతనికి జాలగాయములు తగిలినవికాని మూర్ఛవహించి మరల లేచి బయల్వెడలెను. ఆత డట్లొక యరగంట నడచునప్పటికి దూరంబున బ్రహ్మజెముడు పొదయొం డగుపడెను. సంతోషాక్రాంతచిత్తుడై యాకంచెను దాటి లోనకు జొచ్చెను. కాళీవిగ్రహ సమీపమునకు బోవునప్పటికి నక్కడంతయు ధూమాకర్షితమై పోయెను. పెన్మంటలు ధూమమును వెంబడించెను. రమాకాంతుని విస్మయంబునకు మేరయే లేదు. ఆతడు గోడదాటి యీవలకువచ్చి చూచెను. ఆగోడపై నొకచో రాజారావు కూర్చుండి యుండెను. చుట్టును మంటలుండెను. నడుమ రాజారావుండెను. అగ్నిస్ఫులింగములు పై కెగయుచుండెను. జ్వాలలు మెండ

మ్యెను. రాజారావు రమాకాంతుని చూచి వికటమందహాస మొనర్చెను. రాజారావునకు మంటలు దూరముగనే యుండెను. రాజారావు చెప్పదొడంగెను. "రమాకాంతా! నీవు నాకు దగిన ప్రతిద్వంద్వివి దొరకితివిగదా యను సంతసంబున నింతకాలమువరకు నాసర్వశక్తుల నుపయోగించి పనిచేసితిని. కాని నాకది చిరకాలము లభించలేదు. నేనెంత బుద్ధిశాలినో యెంతటి మేధావంతుడనో నీవెరుంగజాలవు. ఎందుకని. నీవు మేధావంతుడవు గానందుననే. ఇక నాకు పదినిముషంబులలో మరణంబు చేకూరును. కాన సంగ్రహంబుగ నావినీతచరిత్ర చెప్పెదను. అప్పటికి నాకు కొంత మనశ్శాంతి గల్గును. వినుము. నేను పుట్టినది మళయాళదేశము. నాతలితండ్రులు చిన్నతనమునందే మృతినొందిరి. నేను పాఠశాలలో నాంగ్లము జదువుచుండెడివాడను.

రమా—అప్పుడు నీ పేరేమి?

రాజా—నా పేరప్పుడు వీరనాథభట్టు. నాకు పదునేడవయేట నేను పుదుచ్చేరి వెళ్లి యచ్చట నొక వణిజునివద్ద వేతనంబున కుంటిని. ఇట్లుండ నొక దివసంబున నాయూరికి గొందరు బైరాగులు వచ్చిరి. నాకేదైన జాతకఫలంబు చెప్పుదురను నాశచే వారిని జూసితి. వారు మాంత్రికులు. వారల వద్ద నెన్నియో వనమూలికలు గలవు. నాజాతకఫలంబు గొంతవరకు చెప్పిన తరువాత నాకు గొన్నిమంత్రంబుల నుపదేశింపుడని యడిగితిని. వారును చాలసేపాలోచించి మానవ

వశీకరణము, సమ్మోహనము, జ్వరపరమౌషధము, ఇవన్ని యు జెప్పి మూలికల గొన్నిటి నిచ్చిరి. వారలకు పదిరూప్యం బుల నిచ్చి యిల్లు సేరితిని. నాయజమానుడగు వణిజున కొక తనయ గలదు. ఆమెను వశముచేసికొని యామెతోడ విష యాసక్తుల దేలియాడ వచ్చునని యెంచి మానవవశీకరణముచే నామెను వశపరచుకొంటిని. ఆమెతోడ బ్రహ్మానంద మనుభవించుచుంటిని. ఒకనాడున నా వణిజుని కుమారు డది గాంచి నాపై గోపగించుకొనెను. ఆతని నాదివసంబుననే చంపివైచితిని. ఇప్పటివరకు నాజీవితాంబుధియం దిరువది మూడు హత్యల గావించినాడ.

కొందర మోహంబుచేత వశముచేసికొని చంపితిని—కొందర ధనకాంక్షచే జంపితిని—కొందర వైరముచే జంపితిని. మోహన్‌లాలును రత్నలాలు బ్రతికియుండగనే వశము చేసికొంటిని. శ్యామసుందరుడు వలపులరాణిని దీసుకవచ్చిన యిరువదిలక్షల రూప్యంబు లిచ్చెదననెను గనుక మోహన్ లాలుతో స్నేహముజేసితి. వెంటనే మోహన్‌లాలును వశపరచుకొని రత్నలా లున్నంతకాలము వలపులరాణి దొరకదని మోహన్‌లాలునకు దనయన్నపై ననహ్యము జనింపజేసితిని. ఆతడు రత్నలాలు ధనము గైకొనవలెనని తలంపున్నదని యంతకుపూర్వమే నాతోడజెప్పినాడు. రత్నలాలును జంపువిధ మాలోచించిన నాకు పదునైదు లక్షలిచ్చెదనని చెప్పినాడు. ఆనందకుటీరమువద్ద రత్నలాలు మోటారున కెదురుగా వెళ్ళి

నది మేమే! నాయుద్దేశ మేమన వలపులరాణిని తీసుకవెళ్లు దమని. మోహన్‌లాలు చంపుట యుద్దేశము గలిగి మోటా రాగగనే రత్నలాలును దుపాకీతోగాల్చి చంపెను. వలపుల రాణిని గొంతకాలమువరకు కాతనియొద్దనే యుంచుకొనుమని చెప్పితిని. ఆతడు నీవు చేయుపనులనెల్ల బ్రత్యామ్నాయ ముగ జెప్పుచుండెడివాడు. నీ వాతని నెన్నడును దర్శించ నందున నాతడు నిన్ను మోసపుచ్చుటకు దగిన యదను లేక పోయినది. నీభార్య నాదివసంబున మానవవశీకరణముచే దీసుకవచ్చినది నేనే. రత్నలాలు హృదయంబులో నున్న గుండ్లమీద నుండిన సంకేతాక్షరములు నాపేరే! వీరనాధ భట్ట రాజారావు. అదియే విశ్వాసరావునకు కూడ ననుక రించుగదా యని తలంచి యొకవేళ నెవ్వరైన బట్టుకొనిన నాతనినే బంధింతురను నాశతో నట్లుగావించితిని. నీవు మోహన్‌లాలింట్లో దొంగిలించిన పసరుసీసా నేనే యాతని కిచ్చితిని. అగుండ్లను నేనే తయారుచేసితిని.

రమా—రత్నలాలు విద్యుత్ప్రదర్శనమునకు జనినా డని మీకెట్లు తెలిసినది?

రాజా—మోహన్‌లా లింటివద్దనుండి జెప్పి యాతడు వెళ్ళిన తరువాత మమ్ముల గలసెను.

రమా—నీవు రాజారా వనుపేర గల్యాణనగరమున నుండు టెందులకు?

రాజా—బుద్ధిహీనుడా! ఆలోచనయే లేదు. వణిజ సుతుని జంపితినని నన్ను పట్టుకొనవలెనని రక్షకభటులు తిరుగుచుండగా నేను తప్పించుకుని బొంబాయిలో రాజారావనుపేర వ్యవహరించుచుంటిని. అప్పుడే శ్యామసుందరుడు వలపులరాణిని వెదుకమని విశ్వాసరావును బొంబాయి పంపినాడు. విశ్వాసరావుమూలమున శ్యామసుందరుడు నాకు స్నేహితుడయ్యెను. హత్య జరిగిననాటికి పదునైదుదినంబుల పూర్వమే కళ్యాణనగరమున గాపుర ముంటిని.

రమా—నీవు బొంబాయిలో వినయభూషణుని యెఱుగుదువా?

రాజా—ఆతనికి పినతండ్రి యొకడుకలడు. వారల వశముచేసికొనినది నేనే. హత్యానంతరము వారు మా స్నేహముమానిరి. వారల నచిరకాలంబులోనె బంధించితిమి. పినతండ్రిని జంపితిని. వినయభూషణుడుగూడను చనిపోయియేయుండును. అలివేణిని బలాత్కారముగ బంధించితిమి. అప్పుడామెను కౌగిలించుకొనినది నేనే. నాపాపమునకు పరిణామమే లేదు. జ్వాలలు సమీపించుచున్నవి. నీవు రాకమునుపే మూలికారసం బీగోడచుట్టును బోసి యగ్ని బెట్టితిని. ఇక పోవుచున్నాను. హా—" అని యాతడా యగ్నిజ్వాలలయందు లీనమైపోయెను. రమాకాంతు డచిర కాలములోనే రక్షకభటస్థానము జేరెను. తెల్లవారుసరికి హంతకుల నద్దెబండ్లపై నెక్కించి, బిజూరు ధూమశకటస్థాన

మునకు జనిరి. శ్యామసుందర మోహన్‌లాలుల ముఖములు వివర్ణములై పోయెను. వారు కనులెత్తుటయే లేదు, వెంటనే విషయమంతయు పోలీసుసూపరెంటెండెంటునకు దెలియపరచిరి. మధ్యాహ్నమున కందరు రత్నలాలు హత్యారహస్యము రమాకాంతుడు భేదించినాడనియు నందరువచ్చి చూడవచ్చుననియు జాటబంచిరి. పదిగంటలగుసరికి న్యాయస్థానమున జనులు కిటకిటలాడుచుండిరి. న్యాయాధికారియెదుట రమాకాంతుడు శ్యామసుందరుని ఖడ్గమును, రాజారావు మందు సీసాను, సీసపుగుండ్లను, వినయునిలేఖనుబట్టి వలపులరాణిని, యలివేణిని, వినయభూషణు తనయుని, నొకచో నిలువబెట్టెను. అలివేణి తనచరిత్ర నంతయు జెప్పివైచెను. వలపులరాణి తనవిషయమంతయు విశదమొనర్చెను. వినయభూషణు తనయుడు తనతండ్రిని జంపిన రీతి తన పినతాతను జంపినరీతి విశదమొనర్చెను. రమాకాంతుడు తానా మందు సీసాను మోహన్‌లాలింట్లో తీసికొంటిననియు, ఖడ్గము రాజారావు భూగృహములో జూచితిననియు, లేఖ వినయభూషణుని శవదుకూలంబుల నుండి గ్రహించితిననియు జెప్పివైచెను. హంతకులు వారలు మాట్లాడినదాని కియ్యకొనిరి. సాక్షుల విచారణ పూర్తియైనది. నేరము నిర్ధారణమైనది. న్యాయాధికారి తీర్పు యిట్లు చెప్పెను.

"హంతకు లందరిలోను గతించిన రాజారావు మిగుల దురాత్ముడు. కాని యాతడు చనిపోయినాడు. తరువాత యీ

మోహన్‌లాలు. ఈ నృశంసున కెట్టిశిక్ష విధించినను బాపము లేదు. తరువాత శ్యామసుందరుడు దోషి, ఈతడు రాజు. ఈతడే యిట్టిపను లొనర్చిన యిక ప్రజ లొనర్చరా వీరల నిరువురకు ద్వీపాంతరవాసశిక్ష నా జన్మాంతముగ విధించు చున్నాను. శ్యామసుందరుడు రాజ్యభ్రష్టుడైనాడని వినినంత నె యందరు చప్పటలు జరిచిరి. శ్యామసుందరుడు మొగం బెత్తలేదు. విశ్వాసరావునకు రామరాజునకు పంద్రెండేండ్లు కఠిన కారాగారశిక్ష రహీమునకు రెండేండ్లశిక్ష.''

అందరును జప్పటులు చరచిరి. మోహన్‌లా లింటివద్ద నుండి రెండులక్షలపదివేల రూపాయలను దెప్పించి వలపుల రాణికి రెండులక్షలును, రమాకాంతునకు పదివేల రూపాయ లను నిచ్చెను. మరణశాసన మక్కడనే వ్రాసెను. తన జీవిత చరిత్రను సాంతము జెప్పెను. అందరు న్యాయస్థానమునుండి వెడలిరి.

౧౮

సక్రమముగ పాలతనునగరమందు శ్యామసుందరుని తనయుడగు రాజసుందరునకు బట్టాభిషేకము జరుపబడియెను. వలపులరాణి రాజసుందరుల వివాహమహోత్సవము దర్శ నీయమై, గడుంగడు రామణీయకముగ నుండెను. శ్యామ సుందరుడు పట్టాభిషేకము దర్శించి వెడలెను. రమాకాంతుడు

గూడ పట్టాభిషేకము దర్శించి యింటికి వచ్చెను. అన్నపూర్ణ తనకు దొరకెను. రమాకాంతునకు దొరతనమువారు గొప్ప గొప్ప బహుమానముల నిచ్చిరి. గౌరీశంకరుడు రక్షకభటాధికారి యయ్యెను. ఇక రమాకాంతు డింటివద్ద విశ్రాంతిగ గాలము గడపుచుండెను. ఆతడద్దానినే సదా కోరుచుండెను.

పాఠకమహాశయా! తన మోహంపుదళుకుల నెవ్వతె ప్రతివారిని భ్రమింపజేసినదో, యెవ్వతె శృంగారముచేత భ్రమింపబడి రత్నలాలు తన ప్రాణముల గోల్పోయెనో, యెవ్వతె లావణ్యమును గాంచి శ్యామసుందరుడు రాజ్యభ్రష్టుడాయెనో, ఎవ్వతె విమల మందహాసలీలల భయంకర సంఘటనము లయ్యెనో, అట్టి లావణ్యరాశి—శృంగారదేవత—మనోహారిణి— ముద్దులగుమ్మ — ఆ వలపులరాణి నెన్నడైన మరతువా!

సంపూర్ణము



శ్రీ కొండపల్లి ప్రెస్, రాజమండ్రి—1948.

# నవలలు

| | | | | | |
|---|---|---|---|---|---|
| అన్నీ తగాదాలే | 1 | 0 | కొమ్మదాసరి | 0 | 4 |
| అవును | 1 | 0 | ఉరిస్తంభం | 0 | 4 |
| నిజం | 1 | 0 | కర్మకాదు | 0 | 4 |
| మాటవరుస | 2 | 0 | నరాంతకుడు | 0 | 4 |
| మేజువాణి | 1 | 0 | దేవాంతకుడు | 0 | 4 |
| కొరడాదెబ్బలు | 0 | 4 | కనకాంబరంనీలాంబరంకలసి | 1 | 0 |
| పిలువనిపేరంటం | 0 | 4 | ఇంతి | 0 | 6 |
| దాసోహం | 0 | 4 | చామంతి | 0 | 6 |
| మొదల్లేదు | 0 | 4 | పూబంతి | 0 | 6 |
| దాంపత్యం | 0 | 4 | గంగ | 0 | 6 |
| ఆడపడుచు | 0 | 4 | యమున | 0 | 6 |
| మోటసరసం | 0 | 4 | సరస్వతి | 0 | 6 |
| వెయ్యినూటపదహార్లు | 0 | 4 | నాటకరాకాసి | 0 | 4 |
| కాశీయాత్ర | 0 | 4 | పెళ్ళిచూపు | 0 | 4 |
| చెయ్యి జారేక | 0 | 4 | కళ్ళల్లో కారం | 0 | 4 |
| యాముని తీర్పు | 0 | 4 | శుభవార్త | 0 | 4 |
| బస్తీ వైశ్యం | 0 | 4 | కులాంగన | 0 | 4 |
| వ్యభిచారిణి | 0 | 4 | బ్రతకడ మెందుకు? | 0 | 4 |
| కులట | 0 | 4 | తప్పేముంది? | 0 | 4 |
| తప్పనిసరి | 0 | 4 | అబల 1 వ భా॥ | 0 | 4 |
| ఆడపెత్తనం | 0 | 4 | డిటో 2 వ భా॥ | 0 | 4 |
| షోగ్గాడు | 0 | 4 | ఫిలిం డైరక్టరు 1 వ భా॥ | 0 | 4 |
| నీలివార్త | 0 | 4 | డిటో 2 వ భా॥ | 0 | 4 |
| హరిదాసి | 0 | 4 | సేవకురాలు 1 వ భా॥ | 0 | 4 |
| చోరీనేరం | 0 | 4 | డిటో 2 వ భా॥ | 0 | 4 |
| లాటరీ టక్కరి 1 వ భా॥ | 0 | 4 | నాదేశం | 0 | 4 |
| డిటో 2 వ భా॥ | 0 | 4 | దేవదాసి | 0 | 4 |
| మేజువాణి | 0 | 4 | మొక్కుబడి | 0 | 4 |
| తీరనికోరిక | 0 | 4 | సానిహృదయం | 0 | 4 |
| గుడ్ బై | 0 | 4 | లోకాభిరామాయణం | 0 | 4 |

# నవలలు

| | | |
|---|---|---|
| అగ్గిరాముడు | 1 | 0 |
| భయంకరుడు | 1 | 0 |
| రమేశబాబు | 0 | 12 |
| సర్కిల్ రంగనాథం | 1 | 0 |
| శకుంతల బి. ఏ. | 1 | 0 |
| చదువుకున్న భార్య | 1 | 0 |
| నీ నేనా ? | 0 | 12 |
| ఛాందసుడు | 0 | 12 |
| శక్తికుమారి | 1 | 0 |
| పంజాబు మెయిల్ | 1 | 0 |
| కన్నపుదొంగ 1 వ భా॥ | 1 | 0 |
| పగటిచుక్క 2 వ భా॥ | 1 | 0 |
| డిటో 3 వ భా॥ | 1 | 0 |
| రమాసుందరి 1 వ భా॥ | 1 | 0 |
| డిటో 2 వ భా॥ | 1 | 0 |
| రక్తవాహిని (అయిదు హత్యలా ?) | 1 | 0 |
| ఇంద్రజాలము | 1 | 0 |
| రాజద్రోహి | 1 | 0 |
| అర్ధరాత్రపువింత (3 హత్యలు) | 1 | 0 |
| దురాశ 1 వ భా॥ | 1 | 0 |
| డిటో 2 వ భా॥ | 1 | 0 |
| దొంగలనాయకుడు | 1 | 0 |
| మోహపిశాచము 1 వ భా॥ | 1 | 0 |
| డిటో 2 వ భా॥ | 1 | 0 |
| కాలసర్పము 1 వ భా॥ | 1 | 0 |
| డిటో 2 వ భా॥ | 1 | 0 |
| విషహృదయము | 1 | 0 |
| వలపులరాణి | 1 | 0 |
| నేనెవరి భార్యను ? | 1 | 4 |

| | | |
|---|---|---|
| నేనెవరి భర్తను ? | 1 | 4 |
| వ్యామోహము | 1 | 0 |
| జీవనప్రభాతము(రఘునాథజీ) | 1 | 8 |
| జీవనసంధ్య (తేజసింగు) | 1 | 8 |
| వాడే వీడు 1 వ భా॥ | 1 | 8 |
| నేనే 2 వ భా॥ | 1 | 8 |
| కాలూరాయి 3 వ భా॥ | 1 | 8 |
| ధర్మరాజు | 1 | 0 |
| అహల్యాబాయి | 1 | 0 |
| రాజరత్నం | 1 | 0 |
| కృష్ణవేణి | 0 | 12 |
| శ్యామలత | 1 | 0 |
| కర్పూరమంజరి 1 వ భా॥ | 1 | 8 |
| డిటో 2 వ భా॥ | 1 | 8 |
| రామచంద్రవిజయము | 1 | 0 |
| సౌందర్యతిలక | 1 | 8 |
| వినోదములు 1 వ భా॥ | 0 | 12 |
| డిటో 2 వ భా॥ | 0 | 12 |
| Tales of Rajasthan అను | -- | |
| రాజస్థానకథావళి 1 వ భా॥ | 1 | 8 |
| డిటో 2 వ భా॥ | 1 | 8 |
| మణిమంజరి | 0 | 6 |
| సువర్ణగుప్తుడు | 0 | 6 |
| చమత్కారమంజరి 1 వ భా॥ | 1 | 0 |
| డిటో 2 వ భా॥ | 1 | 0 |
| Lives of Great men | | |
| మహాపురుషుల జీవిత చరిత్రలు | | |
| 1 వ భా॥ | 1 | 0 |
| 2 వ భా॥ | 1 | 0 |
| 3 వ భా॥ | 1 | 0 |